వస్తూంది!

**మే 6 వ తేదీన తమిళనాడులో విడుదల!**

యు. ఆర్. జీవరత్నం; యస్. యం. కుమరేసన్;
పులిమూటై రామస్వామి మొదలైనవారు నటించారు.

డైరెక్షన్: ఏ. సోమసుందరం; ఏ. కాశిలింగం.

తెలుగునాట విడుదలకు ఎదురు చూడండి.

జుపిటర్

# అభిమన్యు

పూర్ణా రిలీస్

(తమిళం)

ఆంధ్ర, దత్త మండలములకు: పూర్ణా పిక్చర్స్, బెజవాడ & గుంతకల్లు

## ఈ సంచికలో యివి చదువుకోండి



ఇవిగాక, చిక్కుచదరాలు, ముగ్గులు,
చిక్కుబొమ్మలు, పొడుపుకథలు
ఇంకా, యింకాఎన్నోవున్నై.


చందమామ ఆఫీసు,
పోష్టుబాక్సు నెంబరు 1686, మద్రాసు.




సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 2 | మే, 1948 | సంచిక 5

పాపాయిలూ!

మీరు కుంభకర్ణుణ్ణిగురించి విన్నారూ? అతను రావణాసురుడి తమ్ముడు. అతనిశరీరం ఎంతపెద్దదో తెలుసునా? పెద్ద పర్వతమంత ఉంటుందట.

అతను పూటకు నూరు దున్నపోతుల్ని భోంచేసేవాడట! కొన్నిపీపాల సారాయి తాగేవాడట! అయితే అతనిది జాలిగుండె అట. అందుకని బ్రహ్మదేవుణ్ణిగురించి నిర్దయ అనేవరం కావాలని తపస్సు చేశాడట. అతనికి ఆవరం

యిస్తే ఇక ఈ ప్రపంచంలో అతన్ని జయించేవాడే ఉండడు. అందుకని దేవతలంతా బ్రహ్మదేవుని భార్య సరస్వతీదేవితో మొరపెట్టుకున్నారట. అప్పుడు సరస్వతీ దేవి కుంభకర్ణుడు వరం కోరుకునే సమయంలో అతని వాక్కులో ప్రవేశించి నిర్దయకు బదులు నిద్ర కావాలని వరం కోరించిందట. బ్రహ్మదేవుడు ఆవరం యిచ్చి వెళ్లి పోయాడట.

ఆనాటినించే కుంభకర్ణుడికి ఆరునెల్లునిద్ర ఆరునెల్లు మెలకువ. రామ రావణ యుద్ధం అప్పుడు కుంభకర్ణుడు నిద్రలో వున్నాడు. అతను పండుకునే గుహ ఎంత పెద్దదో తెలుసునా? 30 యోజనాల పొడుగటు, 10 యోజనాల వెడల్పట! యోజనమంటే ఎంతో తెలుసునా? మూడుమైళ్లకు ఎక్కువగానే ఉంటుంది. అతన్ని లేప టానికి వెళ్లిన రాక్షసులంతా అతని ముక్కుల్లోంచి వచ్చే గాలికే బయటికి కొట్టుకొచ్చారట. అతన్ని లేపటానికి వాయించిన నగరాలమోత అతను పెట్టే గురకమోతలో వినిపించనే లేదట! అతన్ని ఈటెలతో పొడిస్తే అతనికి నల్లి కుట్టినట్టుకూడా వుండేది కాదట.

అలాంటి కుంభకర్ణుణ్ణి రాక్షసులు రాముడితో యుద్ధం చేయటానికి లేపుతున్నారు. అట్టమీద బొమ్మ అదే.

# రోకంటి పాటలు

చీకటి కోనలో నేనొక్కదాన్ని
శివుడు నాకిచ్చాడు చిన్ని బాలుణ్ణి.
వారికీ అన్నము వలసొచ్చునాని
వసుదేవు డంపాడు వడ్లగోతాలు.
అన్నకొడుకా రార వెన్నపెట్టెదను
ఎత్తుకొని ఎడ చందమామ చూపెదను.
బావకొడుకా రార పాలుపోసెదను
పంజరాలా పచ్చ చిలుక నిచ్చెదను
మత్స్యావతారాన మామగండాన
పుట్టాడు కృష్ణమ్మ భూమండలాన
రేపు జూడారమ్మ రేపల్లెవాడ
మాపు జూడారమ్మ మా బలిజపేట
విజయలిస్తారమ్ము యిది కందుకూరు
గొల్లలిస్తారమ్మ గ్రోకినల్లూరు.

మేనమామనుజంపి మేలు రథమెక్కి
కృష్ణమ్మ కడుకీర్తి నొందె నేటికిని.
పుట్టిన బిడ్డానెల్ల భూమ్మీద చంపి
పూతకి యేపాటి భూములేలింది?
కన్నబిడ్డానెల్ల కత్తి కెరయించి
కంసుడూ ఏపాటి రాజ్యమేలాడు?
గోవింద గోపాల రార కృష్ణమ్మ
ఆనంద మాడుకో మామంద లేలు
నల్లనీ కృష్ణమ్మ యెవరి అల్లాడు
గోవూల గాచేటి గొల్ల లల్లాడు
వేడి కూటికి దొంగ వెన్నలకు దొంగ
ఏపొద్దు కృష్ణమ్మ వేశ్యలకు దొంగ
చద్దికూటికి దొంగ చల్లలకు దొంగ
చన్నుబాలకు దొంగ చిన్నికృష్ణమ్మ.

సంపాదన : ఈ. లక్ష్మీనారాయణ.

# గేయకథలు

వటుకూరి

## బడాయి మేక



కంచెకాలు కల్లుకొన్న
కాకరాకు మేయుచు
మేకపోతు పిలిచె గరిక
మేయు గొఱ్ఱెపోతును

గొఱ్ఱెపోతు
గొఱ్ఱెపోతు వచ్చి "యెందు
కొఱకు బిలిచినావయా?
గొల్లకొయ్య చూస్తె గొంతు
గొరుకునేమొ? పోదునా?"

మేకపోతు
ఎప్పుడైన నా ప్రతిష్ఠ
చెప్పుకొనగ వింటివా;
నన్ను డీకొనన్ సమర్థు
లున్న జెప్పు చూతము

గొఱ్ఱెపోతు
మెత్తనాకు మేసి చేదు
తిత్తి బలిసెనేమయా?

గుండెలున్న రమ్ము నీదు
గొప్పతనము తేల్తును

మేకపోతు

శిరము నొచ్చుచున్నదేమి
చేయు మందు వల్లుడా?
ఇపుడె యెద్దుతోడ బోరి
యేగు డెంచి నాడను



ఇంతలోన కంచెనుండి
యెద్దు తొంగిచూచెను
“నన్ను గూర్చి చెప్పుకొనుచు
నున్నారే”మనడిగెను.

మేకపోతు కంచెపైగ
దూకి పాఱిపోయెను.
గొఱ్ఱెపోతు నెద్దు నవ్వు
కొన్న వొక్క పెట్టున.

పాలు వోవ కూరకే గ ప్పాలుకొట్టు నాపలు
ముగ్గు పైకివచ్చినపుడు మొగము దప్పుకొందురు.





# ఒంటె

గట్టు లొరసిపాఱు నేటి
కాల్వ ప్రక్కనే
మొక్కజొన్న, పొట్టవేసి
మూల్గుచున్నది.

దీని యాను పానులెట్లు
తెలిసికొన్నవో?
నక్క, యొంటె కలిసిమేసి
దుక్కలైనవి.

కాల్వ దాటవలసినపుడు
కాళ్ల బేరమై
గుంటనక్క యొంటెమీద
గూరుచుండును.

పొలము కాపె ఱింగి బడిత
పూజ చేయగా
కంచె కాలులోన నక్క
పొంచి యుండెను.

నాడు నక్క, ఒంటె వచ్చి
జోడు జోడుగా
మొక్కజొన్నపొట్ట లూడ్చి
మెక్కుచుండెను.

నక్క పొట్టనిండి యొంటె
దిక్కు చూచుచు
ఒంటెబావ! కూత కూతు
నూర కుందువా?

ఒంటె

నాదు పొట్ట నిండలేదు
నక్కబావయా!
కొంచె మాగు మిర్వురము
కూసి పోదము.

నక్క

పొట్ట నిండినాక కూత
పెట్టకుండగా
ఆపజాల బావ! నాకి
దలవా టన్నది.



# నక్క

అంటు గూబ గుయ్యి మనగ
నఅవసాగెను
కాపుపచ్చి మీదబడగ
కంచె దూరెను.

పిచ్చి లొట్టి పిట్ట కొళ్లు
పచ్చుడైనది
ప్రొద్దు గ్రుంకి నక్క యొంటె
యొద్ద జేరెను.

తేపివఅకు చూడు కొంప
లేపి వేతును
దొంగవిధవ టంటు ధాము
ధూము చేసెను.

లొట్టిపిట్ట మాట లాడ
కట్టె నిలిచిన
నక్క దాని వీపుమీద
కెక్కి పొమ్మనె.

కాల్యమధ్యకేగి యొంటె
కదను ద్రొక్కెను
నక్క దేమి టంటు బిక్కు
బిక్కు మన్నది.

ఒంటె

కళ్ల దెబ్బ తగిలినపుడు
కాల్వమధ్య నా
కటికు పొరలు నలవాటున్న
దంటు మునిగెను.

గొల్లుమంటు నక్క నీట
కొట్టు కొన్నది
ఒళ్లు దులుపుకొంటు ఒంటె
ఒడ్డు చేరెను.

వెళ్లి వెక్కిరింప జూచు
కుళ్ళుబోతును
సమయ మరసి త్రొక్కిపట్టి
సాగదీతురు.




















## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

ఇక్కడ తొమ్మిది కుందేళ్లు వున్నై. తొమ్మిదీ తొమ్మిది రకాలుగా వున్నట్టు కనిపిస్తున్నయ్యి కదూ? వీటిలో రెండు కుందేళ్లుమాత్రమే ఒక్క మోస్తరుగా వున్నై. మిగతా ఏడు ఏడురకాలుగావున్నై. ఒకే మోస్తరుగా వున్న ఆ రెండు కుందేళ్లు ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబు **53** పేజీలో వుంది, చూడండి.




పూర్వం ఒక వూళ్లో ఒక బీద బ్రాహ్మడుండేవాడు. ఆయనకి యిద్దరు కొడుకులు. ఇద్దరూ ఒకడ్ని మించినవాడు యింకొకడు. తర్వాత కొన్నాళ్లకు బ్రాహ్మడి భార్య గర్భవతి అయింది. ఆమెకు వేవిళ్లలో ఒక కోరిక పుట్టింది. వెలగకాయలు తినాలని. అవి తెచ్చిపెట్టమని కొడుకుల్ని బ్రతిమాలింది. ఆ వూళ్లో వెలగతోట ఎక్కడా లేదు. ఎట్లాగైనా తెచ్చి పెడతామని యిద్దరు కొడుకులూ తల్లికి మాట యిచ్చి బయలుదేరి వెళ్లారు.

కొంతదూరం వెళ్లేసరికి దారికి అడ్డంగా ఒక అడవి వచ్చింది. అందులో జొరబడి యింకా కొంతదూరం ప్రయాణం సాగించారు. అలా వెళ్లుతూండగా కొంత దూరంలో ఒక పెద్దతోట వారికి కనిపించింది. వెంటనే యిద్దరూ ఒక్క అడుగులో తోటలోకి వెళ్లారు. తోటంతా వెలగచెట్ల మయంగావుంది. తోటచుట్టూ చూశారు. ఎవరూ కనిపించలేదు. సరేగదానని యిద్దరూ కావలసినన్ని కాయలుకోసుకుని ఒళ్లో కట్టుకున్నారు. "మన అమ్మ మనల్ని ఎంతో మెచ్చుకుంటుందిగదా!" అని యిద్దరూ సంతోషంతో పొంగిపోయారు.

ఇంతలో ఉన్నట్టుండి ఒక రాక్షసుడు వాళ్లకి ఎదురుగావచ్చి నిలబడ్డాడు. ఆ తోట రాక్షసుడిదని వాళ్లకేంతెలుసు పాపం! ఇద్దరూ ధైర్యసాహసులు కాబట్టి ఆ రాక్షసుణ్ణిచూసి అంతగా భయపడలేదు.

రాక్షసుడు కళ్లెర్రజేసి, "ఓరి పిడుగుల్లారా! నా తోటలోకే జొరబడ్డారా! నిజం చెప్పండి, ఇవన్నీ ఎవరికోసం తీసుకెళ్లుతున్నారు?" అని గద్దించి అడిగాడు.

చెప్పకుంటే చంపుతాడేమోనన్న భయంతో "మా అమ్మ కడుపుతో ఉంది. ఆమెకోరిక చెల్లించటానికి ఈ వెలగకాయలు తీసుకెళ్లుతున్నాము" అని చెప్పారు.

'కడుపుతోవుంది' అనేమాట వినేసరికి రాక్షసుడికి చాల సంతోషం కలిగింది. ఆ

కె. వి. గోపాలరావు, విజయవాడ



యిద్దరినీ చెరోచేత గట్టిగా పట్టుకుని, "మీ అమ్మకు పుట్టబోయే బిడ్డను నాకు ఆహారంగా యిస్తే మిమ్మల్ని వదలుతాను. లేకుంటే యిప్పుడే యిద్దర్నీ గుటుక్కుమని మింగేస్తాను, ఏమంటారు?" అని రాక్షసుడు భీకరంగా బెదిరించి అడిగాడు.

ప్రాణం అరిచేతిలో పెట్టుకుని యిద్దరు "సరే, అలాగే యిస్తాములే" అని చెప్పి తప్పించుకుని యింటికి వచ్చేశారు. కొడుకుల్ని చూసీ చూడడంతోటే తల్లికి ఎక్కడలేని ఆనందం కలిగింది. వాళ్లు తెచ్చిన వెలగకాయల్ని పచ్చడిచేసుకుని తనివితీర తిన్నది. కాని తన కొడుకులిద్దరూ ఆ రోజంతా ఓమూల కూర్చుని వెక్కివెక్కి



ఏడవడం చూసి వాళ్లమ్మకు ఏమీ తోచక, "ఏం నాయనా! ఎందుకలా ఏడుస్తారు?" అని అడిగింది.

"మేము వెలగకాయలకు పోతే ఆ తోటలో మమ్మల్ని ఒక రాక్షసుడు పట్టుకొని, 'మీ అమ్మకు పుట్టేబిడ్డను నాకు ఆహారంగా యిస్తే మిమ్మల్ని వదులుతాను. లేకుంటే మింగేస్తాను' అని బెదిరించాడు. మేము అలాగే యిస్తామనిచెప్పి తప్పించుకు వచ్చాము. మాకేమి చేయడానికి తోచలేదు" అని భోరుమని ఏడ్చారు.

"ఓస్ యింతేకదా! మీరు ఎందుకు దిగులుపడడం? ఆ సంగతి నే చూసుకుంటాలే" అని ఆమె వాళ్లని ఓదార్చింది.



కొన్నాళ్లుగడిచాక ఆమె ఒక ఆడపిల్లను కన్నది. ప్రతిమలాంటి ఆ బిడ్డకు ముద్దుగా "కనకమ్మ" అని పేరు పెట్టారు. ఎంతో అల్లారు ముద్దుగా పెంచుతున్నారు.

ఈ సంగతి ఎలాగో ఆ రాక్షసుడి చెవిని పడ్డది. ఇంకేం! అమాంతంగా కనకమ్మను తినాలని బుద్ధిపుట్టింది. ఒకనాడు రాత్రి ఆ రాక్షసుడు బ్రాహ్మడి యింటిలోకి జొరబడ్డాడు. బ్రాహ్మడి భార్య తన బిడ్డకు పాలిస్తూవుంది. ఆ సమయంలో వాడు ఆమెదగ్గరకువెళ్లి "బిడ్డనిస్తావా? మిమ్మల







నందరినీ చంపమంటావా ?" అని బెదిరించాడు.

బ్రాహ్మడి భార్య తెలివిగా, "యింకా సంవత్సరమైనా దాటలేదు కదా; ఇంకా కాస్త పెరగనియ్యి, నీకే యిస్తాను" అని సమాధానం చెప్పింది.

రాక్షసుడు ఆమె మాటకు ఏమీ అడ్డం చెప్పకుండా, "సరే, పండు బాగా మాగి తేనెగదా తియ్యగా వుంటుంది; మాగిం తర్వాతనే వస్తాను. అప్పుడైనా యివ్వక పోతే మిమ్మల్నందరినీ చంపుతాను" అని చెప్పి తనదారిని వెళ్లాడు.

* * *

కనకమ్మకు ఏడు సంవత్సరాలు దాటినై. ఒకరోజు బ్రాహ్మడిభార్య కనకమ్మతో, "ఏం చేయమంటావే తల్లీ, ఇక నీ ప్రాణమంతా ఆ రాక్షసుడి చేతిలోనే వుంది. వాడిచేతులోంచి నీ సామర్థ్యంకొద్దీ తప్పించుకోవాలి" అని కళ్లనీళ్లు పెట్టుకుంది.

కనకమ్మ వీళ్లందరికన్నా చాలా తెలివిగలది గనక, "నీకెందుకమ్మా ఆ గొడవ! రాక్షసుడు నన్నేంచేయలేడు. వాడిసంగతి నేను చూస్తాలే" అని తల్లికి ధైర్యం చెప్పింది.

ఆ మరుసటిరోజే రాక్షసుడు కనకమ్మ యింటికివచ్చాడు. ఎవ్వరూ ఏమీ మాట్లాడకుండా కనకమ్మను రాక్షసుడివెంట ఏడుపు దిగమింగుకుంటూ సాగనంపారు. రాక్షసుడు కనకమ్మను భుజంమీద ఎక్కించుకుని తన తోటదారి పట్టాడు.

రాక్షసుడికి ఒకపెద్ద భవనం వుంది. ఆ భవనంనిండా వింత వింత వస్తువులు ఉన్నయ్. కనకమ్మను ఆ భవనంలో దింపి, రాక్షసుడు వేటకోసం అడవికి వెళ్లాడు. కనకమ్మ భవనం చుట్టూ తిరిగిచూసింది. ఎన్నడూ చూడని వింతవస్తువులన్నీ కనిపించి ఆమెకు సంతోషాన్ని చేకూర్చాయి. తలిదండ్రుల మాటకూడా మరచిపోయింది.





ఒకనాడు కనకమ్మ భవనంచుట్టూ తిరిగి వస్తూండగా అక్కడ ఒక చక్కని గంధపు స్తంభం కనిపించింది. ఆ స్తంభం చాలా పెద్దది. అందులో ఒకప్రక్క చిన్న సీలవుంది. కనకమ్మ ఆ సీలను చేతితో అదిమింది. వెంటనే స్తంభంలోనుండి ఒక తలుపు తెరుచుకుంది. కనకమ్మ తెల్లబోయింది. అయినా, "ఇదీ ఒకందుకు మంచిదే"నని తీర్మానించుకుని స్తంభంలోకివెళ్లి తలుపు మూసుకుంది. ఈ స్తంభం సంగతి యిన్నాళ్లనించి ఆ ఇంటోవుంటున్న రాక్షసుడికి తెలియదు. రోజూ వాడు వేటకు వెళ్లి తిరిగి వచ్చేలోపుగా కనకమ్మ స్తంభం లోనుంచి బయటికివచ్చి ఉద్యాన వనమంతా ఒక్కసారి తిరిగివచ్చి మరల స్తంభంలోకిపోయి తలుపు మూసుకునేది.

రాక్షసుడు ప్రతిరోజూ కనకమ్మకోసం భవనమంతా వెతికేవాడు. "కనకమ్మా, కనకమ్మా" అని పెద్ద పొలికేకపెట్టి పిలిచేవాడు. స్తంభంలోవుండే కనకమ్మ "ఇక్కడే వుంటున్నాను" అని సమాధానం చెప్పేది. రాక్షసుడికి స్తంభంకూడా మాట్లాడుతుందా అని అనుమానం వేసింది. ఈ స్తంభాన్ని ఇక్కడవుంచడమే తప్పని రెండు చేతులతో బలంకొద్దీ స్తంభాన్ని పీకి భుజంమీద పెట్టుకొని పక్క ఊరిలోని ఒక ఉద్యానవనంలో పారేశాడు.

ఆ ఉద్యానవనం ఆ వూరి రాజకుమారుడుమాత్రం ఆడుకోడానికి రాజుగారు నిర్మించి ఉంచారు. ఆ సాయంత్రం స్తంభంలోనుండి కనకమ్మ బయటికి వచ్చింది. ఆమెకు అదొక వింతగానే తోచింది. రాక్షసుడి పీడ తొలిగిందికదా అని సంతోషించింది. రోజూ ఆ వుద్యానవనం చుట్టూ తిరుగుతూ మంచి మంచి పువ్వులు ఏరుకుని హాయిగా కాలం గడుపుతూవుంది.

ఒకనాడు రాజకుమారుడు ఉద్యానవనంలో ఆడుకోడానికి వచ్చాడు. తోటలో పువ్వులు లేకపోవడం చూసి కోపంతో,



"ఎవరో కొత్తగా పువ్వులు దొంగిలించడం ప్రారంభించారు. వాళ్ళు ఎవరైనా సరే చేతికి చిక్కారంటే వాళ్లపని పట్టిస్తాను చూడు" అనుకుంటూ ఆ వనమంతా గాలించి చూశాడు. ఒకమూల ఎవరో చక్కటి అమ్మాయి మల్లెపూలు గిల్లుతూ ఉండడంచూసి చప్పున వెళ్లి ఆ అమ్మాయిని "దొరికావా దొంగా" అంటూ గట్టిగా రెండు చేతులతో పట్టుకున్నాడు.

కనకమ్మ మొదట ఉక్కిరి బిక్కిరై పోయింది, రాక్షసుడేమోనని. కాని అందమైన రాజకుమారుణ్ణిచూసి సిగ్గుతో అలాగే నిలబడిపోయింది. రాజకుమారుడు కనకమ్మను చూడటంతోనే ఎలాగైనా ఈ అమ్మాయినే పెళ్లిచేసుకోవాలని తీర్మానించుకున్నాడు. ఇద్దరూ ఒకర్ని ఒకరు పలకరించుకున్నారు. పెళ్లి చేసుకుందామంటే చేసుకుందామనుకున్నారు.

రాజకుమారుడు కనకమ్మను రాజభవనంలోకి తీసుకెళ్లాడు. పెళ్లికి కావలసిన సన్నాహాలన్నీ చేయమని మంత్రులకు అజ్ఞాపించాడు.

కనకమ్మ రాజభవనంలో ఉండేసంగతి ఎలాగో రాక్షసుడికి తెలిసిపోయింది. ఇక కనకమ్మను తినకుండా విడిచిపెట్టకూడదని నిశ్చయించుకుని గాజులశెట్టి వేషంతో



రాక్షసుడు రాజవీధిని గాజులమ్ముతూ వస్తున్నాడు. పెళ్లికూతురు కాబోయే కనకమ్మకు చేతినిండా గాజులు తొడుక్కోవాలని కోరిక గలిగింది. వెంటనే గాజుల శెట్టికి కబురంపింది. శెట్టివేషంలోవున్న రాక్షసుడు మంచి సమయం చిక్కిందనుకున్నాడు. కనకమ్మ గాజులు తొడుక్కుంటుండగా మెల్లగా రాక్షసుడు ఆమె చెవిలో "నిన్ను ఈ రాత్రికే నా ఇంటికి తీసుకెళ్ళబోతున్నాను. నేనెవరనుకున్నావు? రాక్షసుణ్ణి. ఈ రాత్రికే నిన్ను పొట్టబెట్టుకుంటా చూడు" అని చెప్పి ఒక్క పరుగుతో వెళ్లిపోయాడు.



ఈ సంగతి కనకమ్మ రాజకుమారుడితో చెప్పి ఎట్లాగైనా తప్పించమని వేడుకుంది. రాజకుమారుడికి ఒక ఉపాయం తోచింది. అచ్చంగా కనకమ్మలాంటి ప్రతిమను చక్కెర పాకంతో తయారుచేయించి ఆమె పడుకునే మంచంమీద పెట్టి ఒకగుడ్డతో కప్పేశాడు. కనకమ్మనుమాత్రం ఆరాత్రికి మరోగదిలో పడుకోబెట్టాడు.

రాక్షసుడు ఎవ్వరికీ తెలియకుండా గదిలోకి జొరబడ్డాడు. అక్కడ మంచం మీద ఉన్న చక్కెరపాకం ప్రతిమనురెండు చేతులతో ఎత్తుకొని చరచరా వెళ్లిపోయాడు. కొంతదూరం వెళ్లేసరికి చక్కెర పాక మంతా మెత్తగా కావటం మొదలుపెట్టింది. రాక్షసుడికి ఏమీ అర్థంగాక కొంచమైనా కొరుక్కు తినాలని బుద్ధిపుట్టి కొంచంగా తలపక్క కొరికాడు;తియ్యగా ఉంది."అరేరే! కనకమ్మా! ఎంత తియ్యగావున్నావు. బలే రుచి, నువ్వంటేనే నా కిష్టం! నిన్ను చక్కగా తింటాను. బలే తీపి కనకమ్మా" అంటూ వెర్రి రాక్షసుడు చేతిలోని పాకం అంతా దిగమింగాడు.

తెల్లవారగానే రాజకుమారుడి పంచదార పాకం ప్రతిమను చూడటానికి గదిలోకి వెళ్లాడు. ఏముంది! పంచదార ప్రతిమ మాయమైపోవటంచూసి కనకమ్మదగ్గరికి వెళ్లి ఈ సంగతంతా చెప్పాడు. కనకమ్మ కూడా ఆశ్చర్యపోయింది. ఇక రాక్షసుడి భయంకూడా తొలిగిపోయింది.

కనకమ్మకు తన స్థితిని తలిదండ్రులకీ అన్నదమ్ములకీ తెలియజేయాలని కోరిక కలిగింది. పరిచారకుల్ని పంపి తన దగ్గరికి అందర్నీ రప్పించుకుంది. ఒక శుభ ముహూర్తాన కనకమ్మ, రాజకుమారుడ్ని పెళ్లిచేసుకుంది. కనకమ్మ గొప్పతనానికి ఆమె మీద తలిదండ్రులూ, అన్నదమ్ములూ ఎంతో సంతోషించారు.

అంతటితో కథ కంచికెళ్లింది మనం ఇంటికి వచ్చాం.





# వీరలక్ష్మి

## పెద్దక్కయ్య



[గతసంచిక తరువాయి]

ఆరాత్రి వీరలక్ష్మి తన గదిలో, మంచం కిటికీ దగ్గిరగా వేసుకుని, ఒక పెద్ద కత్తి దిండుకింద పెట్టుకుని, నిద్రపోతున్నట్టు నటిస్తో పడుకుంది.

ఒక రాత్రివేళ దొంగ వెంకయ్య తన అయిదుగురు తోడిదొంగలతో, వీరలక్ష్మి యింటికివొచ్చి, వీరలక్ష్మికోసం వెతుకుతో, ఆమె గదిదగ్గిరికి వొచ్చాడు. ఆగదిలో ఆమె వుందో లేదో అని దొంగ వెంకయ్య కిటికీ లోంచి తొంగి చూశాడు. పడుకున్న వీరలక్ష్మి కాస్తా చటుక్కునలేచి కత్తితో వాడి ముక్కు కోసేసింది. వాడు బాధతో ఏమీ మాట్లాడలేక తన ముక్కు కోసేసిందని, వేలుతో కిటికీవేపు చూపించాడు. వీరలక్ష్మిని గుర్తుపట్టి వాళ్లనిగూడా చూడమంటున్నాడనుకుని, దొంగ ఒక్కొక్కడే తొంగి చూడనూ, వీరలక్ష్మి వాడిముక్కు కోసెయ్యనూ, మళ్లీ వాడు బాధతో మాట్లాడలేక, సంజ్ఞచెయ్యనూ, మళ్లీ ఇంకోడు తొంగిచూడనూ, వీరలక్ష్మి వాడిముక్కు కోసెయ్యనూ, ఇట్లా ఆరుగురూ ముక్కులు కోయించుకుని, పారిపోయినారు.

అందులో ఒకడు ఏమిజరిగిందోనని అగ్గిపుల్ల వెలిగించి అందరి మొహాలూ చూసేప్పటికి ఎవరికీ ముక్కులు లేవు.

"ఓసి వీరలక్ష్మి! ఎంత పనిచేశావే, వుండు, వుండు, నీకు తగిన శాస్తిచేసిగాని వొదలం" అని తిట్టుకుంటూ ఇళ్లకి చేరుకున్నారు దొంగలు.

మర్నాడు వీరలక్ష్మి ఆదొంగల ముక్కులన్నిటికీ వుప్పు, కారం, బాగా పట్టించి, ఓ పళ్లెంలోపెట్టి, ముసలిదానిలాగ వేషం వేసుకుని కర్ర పట్టుకుని వొణుక్కుంటో నడుస్తో, "ముక్కులండీ ముక్కులు, ముక్కుల్లేని వాళ్లకి ముక్కులూ!" అని అమ్ముతూ బజారులోంచి పోతోంది. అదే సమయంలో దొంగలముఠాలో ఒక దొంగ బజార్లో సామానులు కొనుక్కుందామని,



ముక్కుకి బట్ట అడ్డంపెట్టుకుని వస్తూ, వీరలక్ష్మి కేకవిని ఎంతో సంతోషపడి వీరలక్ష్మిని పిలిచి, "ఏమిటి అమ్ము తున్నావు అవ్వా?" అని అడిగాడు.

"ముక్కులు నాయనా, ఇవి మంత్రించిన ముక్కులు. ముక్కు లేనివారు, చెరువులో స్నానంచేసి, ఈ ముక్కులకి సాంబ్రాణి ధూపంవేసి, అతికించుకుంటే, ఎప్పటిమల్లే ముక్కు అతికిపోతుంది." అని చెప్పింది. వాడు బలే సంతోషించి, ఒక్కొక్క ముక్కు వరహా చొప్పున ముక్కులన్నీ కొనుక్కుని, ఇంటికెళ్లాడు.

"ఒరేయ్, మంచి ముక్కులు చాల తెచ్చాన్రా," అని తను తెచ్చిన ముక్కులని తన స్నేహితులకి చూపించాడు. పాపం వాళ్లందరూ చెరువులో స్నానంచేసి, ముక్కులకి ధూపంవేసి, అందరూ తలో ముక్కూ, తగిలించుకున్నారు. తగిలీ తగిలించుకోగానే ఆ ఉప్పూ కారంకీ, గుగ్గిలంఘాటుకీ, ఆ పచ్చి పుండుమీద భగ్గుమని, మంటలు రేగాయి. ఇంక లబాయిలు, దిబాయిలుమని మొత్తుకుంటూ, ముక్కులు అవతల విసిరిపారేసి, తమ ముక్కులన్నీ బాగా కడుక్కుని, కొబ్బరి నూనెలు రాచుకున్నారు.



"ఓసి వీరలక్ష్మి, ఎంత మోసంచేశావే, నీకు తగిన శాస్తిచేసిగాని వొదలం" అని తిట్టుకున్నారు.

ఎంత ధైర్యంగలదయి నప్పటికీ, ఈ మాటు వీరలక్ష్మికి గుండెల్లో రాయిపడింది. వాళ్లు ఇవన్ని తనే చేసినట్టు గ్రహించి ఇంకా పగపూనుతారనీ, తను ఒక్కత్తె వలన ఏమీకాదనీ, తన అక్క సహాయం గూడా కావలిసి వొస్తుందనీ, అవిడతో ఇట్లా చెప్పింది.

"అక్కయ్యా, నేను చెరువుకి వెళ్లినప్పుడు ఒక దొంగల ముఠా, ఒక దుబ్బు



చాటున కూచుని, ఇవాళ మన పూళ్ళో దోచుకోవాలని ఆలోచన చేస్తోంటే నేను విన్నాను. ఎందుకన్నా మంచిది, మనం ముందుగానే జాగ్రత్తపడదాం'' అని అబద్ధాలు చెప్పి, అక్క సహాయంగూడా తీసుకుంది.

ఆరాత్రి అక్కాచెల్లెలూ, ఇద్దరూ కలిసి, వీరలక్ష్మి గదిలో ఒక పెద్ద రాతిబండ, దగ్గిరపెట్టుకుని, దొంగనిద్రలు పోతూ పడుకున్నారు.

అర్ధరాత్రి, దొంగ వెంకయ్య, అతని ముఠా వీరలక్ష్మి గదికి కన్నంవేశారు. "వీరలక్ష్మికి శాస్తి చెయ్యడానికి ఇదేసమయంరా. ఈమాటు తప్పకుండా నా చేతిలో చిక్కుందని'' హుషారుగా కన్నంలో ముందర కాళ్లు పెట్టి దూరాడు దొంగ వెంకయ్య. వాడు బాగా నడుంవరకూ వొచ్చేదాకా ఆగి, రాగానే, చప్పునలేచి ఆ పెద్ద రాతిబండని వీరలక్ష్మి ఆమె అక్కగారూ కలిసి ఎత్తి, వాడి నడుంమీద పడేశారు. ఆ బరువయిన బండ మీదపడంగానే వాడికి స్పృహ తప్పిపోయింది. బయట కాచుకున్న అయిదుగురు దొంగలూ బండ పడిన చప్పుడు విని "చచ్చామ్రోయ్'' అని పరుగుతీశారు.



వీరలక్ష్మి ఆమె అక్కగారూ కలిసి, దొంగ వెంకయ్యని, ఒక పాత కొయ్య పెట్టెలో పెట్టి పయిన తాళ్ళతో కట్టారు.

తెల్లవారేలోగా వీరలక్ష్మి ఆ కొయ్య పెట్టికి పసుపురాసి కుంకంబొట్టు పెట్టి మళ్ళీ తను ఇంకో ముసలిదానివేషం వేసుకుని, ఆ పెట్టెని ఒక బండిమీద చెరువుగట్టుకిచేర్చి అక్కడ కూర్చుంది. తెల్లవారిన తర్వాత మన అయిదుగురు దొంగలూ, అప్పుల్ని మేపుకోటానికి అక్కడికి వచ్చి ముసలిదాని వేషంలోవున్న వీరలక్ష్మిని





చూసి "అవ్వా, ఆ పెట్టెలో ఏముంది?" అని అడిగారు.

"ధనం నాయనా! ఈ ధనమంతా ముసలిదాన్ని, ఏం చేసుకుంటాను? ఏ కాపు వాడికన్నా ఇచ్చి ఓ ఆవుని తీసుకొని పాడి చేసుకుందామని చూస్తున్నాను" అంది.

"అయితే అవ్వా, మాకిస్తావా ఆ పెట్టె? నీకు నచ్చిన ఆవుని ఇస్తాము." అన్నారు దొంగలు.

"అంతకన్నానా, నాయనా. కాని ఇది మా పూర్వీకుల సొత్తు. ఈ పెట్టెని జాగ్రత్తగా తెరవాలి. మీ ఇంటికి వెళ్లి స్నానంచేసి, పెట్టెని పాలతో కడిగి, దీపారాధనచేసి, సాంబ్రాణి పొగవేసి, కొబ్బరి కాయ కొట్టిగాని, దీన్ని తెరవగూడదు. ఈలోపల తీశారా, దీనిలో వుండే లక్ష్మి, దెయ్యమయి మిమ్మల్ని పీక్కుని తింటుంది. జాగ్రత్త" అని చెప్పి ఆ పెట్టెని వాళ్లకిచ్చి, ఆవుల్లోకల్లా మంచి ఆవునీ, దాని దూడనీ ఇంటికి తోలుకుని పోయింది వీరలక్ష్మి.

ఈ అయిదుగురు దొంగలూ, "ఒరే, మన పంట పండిందిరోయ్" అని సంతోషిస్తో, ఆ పెట్టెని మోసుకుని పోతున్నారు. పోయినకొద్దీ ఆ పెట్టె బరువు ఎక్కువవుతోంది. కొంతదూరంవరకూ ఓపికపట్టి ఎలాగో మోశారు పాపం. ఇక తరవాత మోయలేక. "ఏమయితే అయింది, ఇంక మోయలేం బాబూ, నడుం బద్దలయిపోతోంది." అని కింద పడేసారు. పెట్టె కింద పడీపడటంతోటే ముక్కలు, ముక్కలు, అయిపోయింది. అప్పటివరకూ లోపల స్పృహతప్పిన వెంకయ్య కొంచెం గాలితగిలి, "వూ(" అని మూలిగాడు. ఆమూలుగువిని "నిజమేస్రోయ్ బాబోయ్, దీంటో లక్ష్మి దెయ్యమయింది." అని అయిదుగురూ ఒకటే పరుగు. ఈలోపల, గాలితగలడంవల్ల, ఊపిరి సలిపి వెంకయ్యకి తెలివివొచ్చి లేచి కూచున్నాడు. "బాబోయ్,



దెయ్యం లేస్తోందిరోయ్" అని కేకలుపెట్టి, ఇంకా వేగంగా పరుగుతీసారు దొంగలు. పాపం దొంగ వెంకయ్య తన స్నేహితుల్ని గుర్తుపట్టి, "ఓరేయ్, ఏమిట్రా అట్లా పరిగెత్తుతున్నారూ? నాకోసం ఆగండిరా" అని వాళ్ల వెంట పడ్డాడు. 'ఓరి బాబో, దెయ్యం వెంబడిస్తోంది" అని వాళ్ళు ఇంకా పరుగులెత్తారు.

వాళ్లు ముందు, దొంగ వెంకయ్య వాళ్ల వెనకా, ఇట్లా పోగాపోగా, ఆ అయిదుగురికి అలసటవొచ్చి యిక చస్తే చచ్చామని, రొప్పుకుంటో ఓ చెట్టుకింద చేరుకున్నారు. ఇంక దొంగవెంకయ్య కూడా రొప్పుకుంటో వీళ్ళని చేరుకున్నాడు. "ఒరేయ్ అదేమిట్రా దెయ్యం వెంటబడినట్లు, ఆగమన్నా కూడా ఆగకండా అట్లా పరిగెత్తారు?" అని అడిగాడు. అప్పుడు ఆ అయిదుగురూ దొంగ వెంకయ్య మొహం ఎగాదిగా చూసి "ఓరి నువ్వట్రా! దెయ్యమని హడిలి చచ్చాం. సరే, ఆ పెట్టెలోకి ఎట్లా వొచ్చావురా?" అని అడిగారు. అప్పుడు దొంగ వెంకయ్య జరిగిందంతా చెప్పాడు.

"ఓసి, జిత్తులమారిముండ ఎంతపని చేసింది! నిన్ని పెట్టెలోపెట్టి, పూర్వీకుల



సొత్తని, మమ్మల్ని మోసంచేసి అంటకట్టి, మన అవుల్లోకల్లా మంచి అవుని, దూడతో సహా తోలుకుపోయింది. ఇంక మళ్లీ దీని జోలికి వెళ్ళామా ఈసారి మనని ప్రాణాలతో బయట పడనియ్యదు." అని వీరలక్ష్మిని తిట్టుకుంటో ఇళ్ళకి చేరుకున్నారు.

కొన్నాళ్లపాటు వరసగా దొంగలు రాకపోవడం చూసి వీరలక్ష్మి ఇంక దొంగలు భయపడి రావడం మానేశారని నిర్భయంగా ఏ భయమూ లేకండా ఎప్పటిలాగానే వుంటోంది. [ఇంకావుంది]







# ఆంజనేయ

అనగా అనగా ఒక ఊరు. ఆ వూళ్ళో ఒక తలారి ఉండేవాడు. ఎలాగైనా డబ్బు సంపాదిద్దామని కోరిక పుట్టింది వాడికి. ఆలోచించి చివరికో ఎత్తు వేశాడు. అప్పుడప్పుడు ఆంజనేయస్వామి పూనినట్లు నటిస్తూ చిందులు త్రొక్కుతూ ఊరిలోకి బయలుదేరేవాడు. అమాయిక ప్రజలను జడిపించి, కడుపునిండా అన్నంతిని కావలసిన డబ్బుకూడా గుంజుకొనేవాడు. అది చాలక కాళ్ళకుకూడా మ్రొక్కించుకొనేవాడు. ఎదురుచెబితే స్వామికి యేం కోపంవస్తుందో అనుకొనేవారు ప్రజలు. యీ విధంగా అమాయిక ప్రజలను మోసపుచ్చి కొన్నాళ్ళు గడిపాడు వాడు.

ఆ వూరి కరణంగారికి యీ సంగతి తెలిసింది. ఆయన చాలా గడుసరి. తలారి చేసేపని ఆయనకు నచ్చలేదు. అందుచేత ఎలాగైనా తలారివాడికి అయునబుద్ధి చెప్పాలని నిశ్చయించుకొని సమయం కోసం ఎదురు చూస్తున్నాడు.

ఇలా ఉండగా శ్రీరామనవమి వచ్చింది. ఆ రోజు మామూలుప్రకారం తలారి ఆంజనేయుడు పూనేడని బజారువెంట బయలుదేరాడు. తీరా కరణంగారి యింటిదగ్గిరికి వచ్చేసరికి, కరణంగారు కూడా జుట్టు విరియబోసుకొని, పంగనామాలు పెట్టుకొని, శంఖు ఒకచేత, చక్రం ఒకచేత పట్టుకొని, తలారి ఎదురుగా నిలబడి, "ఒరే! ఆంజనేయా! నన్నే ఎరగవట్రా! యేం రా! యిక్కడ ఇంకెంతకాలం ఉంటావురా! నేను శ్రీరాములవార్ని రా!" అన్నాడు.

తలారి సాష్టాంగపడి, చేతులు జోడించి, "అపరాధం స్వామీ! తప్పు మన్నించండి.

రచన: మూర్తి అన్నయ్య.

## స్వామివారు

తమర్ని మరిచిపోతానా! యీ దాసుడు చెయ్యవలసిన పని ఉంటే సెలవియ్యండి" అన్నాడు.

సమయం చిక్కిందికదా అని "ఒరే! అంజనేయా! నన్ను నీ భుజములమీద ఎక్కించుకొని యీ గ్రామమంతా త్రిప్పు." అన్నాడు కరణంగారు.

తలారి కిక్కురుమనకుండా కరణం గారిని భుజాలమీద ఎక్కించుకొని త్రిప్పుతున్నాడు.

కరణంగారిది అసలే కాస్త స్థూల కాయం. కాసేపు తిరిగేటప్పటికే తలారికి అలసట వచ్చింది. మెల్లిగా నడుస్తున్నాడు. అయినా కరణంగారు వూరుకోలేదు సరికదా, పైగా "అంజనేయా! ఆనాడు ఏడు సముద్రాలు దాటిన నీ శక్తి ఏమైందిరా? త్వరగానడూ" అని శంఖుతో నెత్తిమీద మొట్టడం ప్రారంభించాడు.

తలారికి ఘుచ్చమటలు పోశాయి. "చచ్చాను బాబో" అంటూ కరణంగారిని కిందకి దింపి కాళ్ళు పట్టుకున్నాడు.

"ఏమిరా! అంజనేయా! దింపేశావేం?" అన్నాడు కరణంగారు కోపంగా.



"అంజనేయుడులేదు, అర్థాన్నంలేదు. బాబూ! బుద్ధి వచ్చింది. ఇలాంటి తెలివి తక్కువపనులు యింకెప్పుడూ చెయ్యను. కాస్తే కాయండి. కోస్తే కోయండి. మీదే భారం" అన్నాడు తలారి.

"నీకు అంజనేయుడు పూనకపోతే నాకు శ్రీరాముడూ పూనలేదు. ఇంకమీదనైనా బుద్ధి తెచ్చుకొని బ్రతుకు." అని నాలుగు చీవాట్లు పెట్టి తలారిని యింటికి పంపేశాడు, కరణంగారు.

చూశారా కరణంగారి యుక్తి. ఒక్క దెబ్బను తలారికి బుద్ధిచెప్పారు!

# భోజన నిద్రా ప్రియులు



ర్వం ఒక వూళ్లో ఒక రాజు వున్నాడు. చాలా కాలంవరకు అతనికి సంతానం కలగలేదు. ఆ తర్వాత, ఎన్నో వ్రతాలు, పూజలు, పునస్కారాలు చెయ్యగా, కొన్నేళ్ళకి యిద్దరు పుత్రులు కలిగారు. ఒకడిపేరు 'భోజనప్రియుడు', యింకొకడిపేరు, 'నిద్రాప్రియుడు.' వీళ్లిద్దరూ ఒకేబడిలో చదువుకుంటూ, ఎప్పుడూ కలసిమెలిసి తిరుగుతుండేవాళ్ళు.

కొన్నాళ్ళకు యిద్దరూకూడా అన్ని విద్యల్లోనూ బాగా ఆరితేరారు. అప్పుడు వాళ్ళకి ఒక కోరిక కలిగింది. దేశాంతరాలు పోవాలని. తమ కోరిక తండ్రితో చెప్పారు. గారాబంగా పెరుగుతూ వున్నారుగదూ, అందుకని 'సరే, అలాగే వెళ్లిరండి' అన్నాడు తండ్రి. సరేనని యిద్దరూ చెరొక గుఱ్ఱము ఎక్కి బయలుదేరారు.

అలా వాళ్లిద్దరూ ఎన్నో అరణ్యాలు, నదులు, కొండలు దాటి చివరికి యింకో రాజుగారి పట్టణం చేరుకున్నారు. వాళ్లిద్దరూ సరాసరి రాజుగారి దగ్గిరికి వెళ్లి 'చాలా దూరంనించి వస్తున్నాము. మాయిద్దరికీ భోజనం పెట్టించాలి. యిద్దరం చెరి పది రూపాయలూ యిచ్చుకుంటాం' అన్నారు. సరేనని రాజుగారు వంటబ్రాహ్మణ్ణి పిలిచి వాళ్లిద్దరికీ తిన్నంత భోజనం, అన్ని రకాల పిండి వంటలతో పెట్టమని చెప్పారు.

వంటబ్రాహ్మడు సరేనని వెళ్లి రకరకాల పిండి వంటలతో భోజనం తయారుచేశాడు. మన భోజన నిద్రాప్రియులు విస్తళ్ళ ముందు కూర్చున్నారు. నిద్రాప్రియుడు మామూలుగానే అన్నం కలుపుకుని తినేస్తున్నాడు. కాని భోజనప్రియుడు ఒక ముద్ద నోట్లో పెట్టుకుని, తుఫ్, తుఫ్ అని వుమ్మేసి, "చచ్చీ, చెడీ చాలాదూరం నించి వచ్చాంగదా అని విస్తరికి పది రూపాయ లిస్తామన్నాం. ఇదేమిటీ ఈఅన్నం పీనుగులవాసన కొడుతోంది?" అని విస్తరి ముందునించి లేచివెళ్లి రాజుతో చెప్పాడు

యం. రాధాకృష్ణ, చీరాల.



రాజు ఆశ్చర్యపోయి వెంటనే వంట బ్రాహ్మణ్ణి పిలిపించి, "ఏమయ్యా, బ్రాహ్మడా! అన్నం పీనుగులవాసన కొడుతున్నదట! మన యింటి ముందుగాని, యింటి వెనకగాని, ప్రక్కలగానీ ఎవరైనా చనిపోయారా?" అని అడిగాడు.

"రామ! రామ! లేదండి ప్రభూ. ఈ చుట్టుప్రక్కల ఎవరూ చావలేదు. మరి అన్నం పీనుగుల వాసన ఎందుకు కొడుతోందో. ఈ బియ్యంకూడా మనకు ఎప్పుడూ పంపే శెట్టిగారే పంపారు." అన్నాడు.

"పిలుచుకునిరా ఆ శెట్టిని" అన్నారు రాజుగారు. సరేనని వంటబ్రాహ్మడు వెళ్లి శెట్టిని పిలుచుకువచ్చాడు. శెట్టి వణుకుతూ రాజుగారి ఎదట నిలబడగానే "ఏమయ్యా శెట్టీ! నీవు పంపిన బియ్యం వండి ఈ కుర్రవాళ్ళకి వడ్డించాం. అన్నం పీనుగుల వాసన కొడుతున్నదంటున్నారు. ఏమిటి కారణం? నీ యింట్లోగానీ, నీ యింటి చుట్టుప్రక్కలగానీ ఎవరైనా చనిపోయారా?" అని అడిగాడు రాజుగారు.

"లేదు, మహారాజా! ఎవరూ చావలేదు. అరవై ఏళ్ళనించీ ఈ బియ్యం నాకు ఒక రెడ్డి పంపుతూవున్నాడు. ఇంతకాలంగా లేనిది యివ్వాళ యీ బియ్యం పీనుగుల వాసన కొట్టటమేమిటో ఆ పరమాత్ముడికి తెలియాలి" అన్నాడు శెట్టి.



వెంటనే రాజుగారు రెడ్డిని పిలిపించి అడిగారు. "నాకు తెలియదు, ప్రభూ! మా తండ్రినడిగితే తెలుస్తుంది" అన్నాడు రెడ్డి.

వెంటనే రాజుగారు రెడ్డి తండ్రిని పిలిపించారు. రెడ్డితండ్రి తొంభై యేళ్ళ పండు ముసలివాడు. వొణుకుతూ రాజుగారి దగ్గిరికి వచ్చాడు. అందరిని అడిగినట్లుగానే రాజుగారు రెడ్డితండ్రినికూడా అడిగారు, అన్నం పీనుగుల వాసన కొట్టటానికి కారణమేమిటని.

"మహారాజా! సర్కారువారు పోరంబోకుస్థలాలు అమరకం పరిచేటప్పుడు



నాకిచ్చిన భూమిలో కొంత శ్మశానభూమి కలిసివుంది. ఆ భూమిలో వ్యవసాయం సాగించి పండిస్తున్న ధాన్యమే యీ అరవై ఏళ్ళనించీ పంపుతున్నాను," అన్నాడు రెడ్డి తండ్రి.

"చూశారా! శ్మశానభూమి కలవటం వల్లనే అన్నం పీనుగుల వాసనకొట్టింది" అన్నాడు భోజనప్రియుడు.

రాజుగారు అతని తెలివికి చాల మెచ్చుకున్నారు. తర్వాత శెట్టీ, రెడ్డీ, రెడ్డితండ్రీ రాజుగారి దగ్గిర శెలవుతీసుకుని వాళ్ళ వాళ్ళ యిళ్ళకు వెళ్లిపోయూరు.

ఈ గొడవంతా పూర్తి అయేసరికి బాగా చీకటి పడిపోయింది. "ఈ రాత్రికి మీరు యిక్కడే పడుకొని తెల్లవారి పోదురుగాని" అన్నారు రాజుగారు. సరే నన్నారు భోజన నిద్రాప్రియులు.

ఇద్దరికీ చెరొక మంచంవేసి, మెత్తటి పరుపులు వేయించాడు రాజు. ఇద్దరూ పడుకున్నారు. భోజనప్రియుడు కాసేపట్లోనే గుర్రుపెట్టి నిద్రపోయాడు. కాని మన నిద్రాప్రియుడు వున్నట్టుండి ఒక్కసారి లేచి రాజు దగ్గిరికిపోయి, "ఇది ఏమిటి మహరాజా, తిండి పెట్టించమంటే పీనుగుల వాసన కొట్టే భోజనం పెట్టిస్తివి. యిక్కడే పడుకోమన్నారు గదా అని పడుకుంటే నేను పడుకున్న పరుపులో ఏడుచుట్ల వెంట్రుకవున్నది. నేను పడుకోగానే ఆ వెంట్రుక కరపటంచేత నావెన్ను దద్దురెక్కింది" అన్నాడు.

రాజు ఆశ్చర్యపోయి వెంటనే నిద్రాప్రియుడు పడుకున్న పరుపు కోయించి చూశాడు. చూస్తే అందులో నిద్రాప్రియుడు చెప్పినట్లుగానే ఏడు చుట్ల వెంట్రుక కనిపించింది.

రాజు వాళ్లిద్దరితెలివికీ సంతోషించి తన యిద్దరు కూతుళ్ళనీ వాళ్లకిచ్చి పెళ్ళిచేసి వాళ్ళవూరికి పంపించాడు. ఇద్దరూ పెళ్లాల్ని గుఱ్ఱాలమీద ఎక్కించుకుని తండ్రిదగ్గరికి వచ్చేసి ఆరోజునుంచీ హాయిగా కాలక్షేపం చేస్తున్నారు.





# పెంత చిలుక

పూర్వం వెంకమ్మ, వెంకయ్య అని భార్యాభర్తలు ఉండేవారు. వెంకమ్మ నోరు మంచిది కాదు. ఎవరో ఒకర్ని ఎప్పుడూ తిడుతూ ఉండేది. వెంకయ్యతో ఎప్పుడూ దెబ్బలాడుతూ వుండేది. వాళ్ళకి పిల్లలు లేరు.

వెంకయ్య ఒకసారి పొలంనించి వస్తుంటే ఒక బుల్లిచిలుక దొరికింది. అది దారితప్పిపోయి ఎగరలేక, అరుస్తూవుంది.



వెంకయ్య ఆ బుల్లిచిలుకను మెల్లిగా పట్టుకుని ఇంటికి తీసుకువచ్చాడు. దానికి పళ్ళూ, కాయలూ పెట్టి ఇద్దరూ పెంచుతున్నారు. పిల్లలు లేక ఆ బుల్లిచిలుకనే ముద్దుగా, గారాబంగా పెంచుకుంటున్నారు.

అది ఎదిగి పెద్దదైంది. రోజూ వూళ్ళోకి పోయి పళ్లూ కాయలూ తెచ్చుకుని ఇంటికి వచ్చేసి తినేది. ఆ చిలుకంటే వెంకయ్యకు ఎంతో యిష్టం.

ఒకరోజున వెంకయ్య పొలంనించి ఇంటికి తిరిగి రావడం ఆలస్యమైంది. వెంకమ్మకు కోపంవచ్చి ఊరికే తిట్టి పోసేసుకుంటోంది, వెంకయ్యని. అప్పుడు జామిపండు తెచ్చుకుని తింటున్న చిలుక సరదాగా 'అక్కయ్యక్కయ్యా' అని పిలిచింది. అసలే కోపంగావున్న వెంకమ్మకు, సరదాగావున్న చిలుకను చూసి కోపం మరీ ఎక్కువైంది. వెంకయ్యమీదవున్న కోపం, అతని కిష్టమైన ఆ చిలుక మీద తీర్చుకోవా లనుకుంది. గబగబా చిలుక దగ్గరకు వెళ్ళి ఒక కత్తెరతెచ్చి దాని నాలుక కత్తిరించేసింది. పాపం, చిలుక నొప్పితో ఏడుస్తూంది. ఊరికే రక్తం కారిపోతోంది.

"పో! నాకు కోపంవస్తే, నీకు సరదాగా వుందేం? ఎక్కడికి పోతావో పో! నా యింటికి వచ్చావంటే చంపేస్తాను. నీకు నాలుక

రచన : "సుధ" — ఆధారం : ఒక ఆంగ్ల కథ



వుంటే, నువ్వు దొంగతనంచేసి పళ్లూ, కాయలూ తెచ్చుకొని తింటున్నావు. అందుకే ఇంక దొంగతనం చేయలేకుండా నీకు నాలుక కోసేశాను. పో." అని వెంకమ్మ చిలుకను గిరాటేసింది. పాపం, చిలుక నోటివెంట రక్తం కార్చుకుంటూ, ఏడుస్తూ పోయింది.

సాయంత్రం వెంకయ్య, ఇంటికివచ్చి చూసుకుంటే చిలుకలేదు. నేలమీదంతా రక్తం కనబడింది. వెంకయ్య, భార్యని అడిగేడు. ఆవిడ వెంకయ్యని తిట్టిపోసింది. చిలుకను నాలుకకోసి పారేశాననికూడా చెప్పింది. పాపం, వెంకయ్యకు తగని కోపంవచ్చింది. అయినా భార్యనోటికి దడిసి ఏమీ అనకుండా వూరుకున్నాడు. చాలా సేపు తన చిలుకకోసం విచారించాడు. వూరంతా వెతికాడు. తనకు ఎంతో ఇష్టమైన చిలుక కనిపించలేదు. విచారంతో ఇంటికి వచ్చేశాడు. వెంకమ్మతో మళ్లీ దెబ్బలాడేడు. వెంకమ్మ మరీ ఎక్కువగా తిట్టింది. కొన్నాళ్లు వెంకమ్మతో మాట్లాడ్డం మానేసాడు. పాపం, చిలుకకోసం బెంగ పెట్టుకు పోయాడు వెంకయ్య. చాలా రోజులు గడిచాయి. చిలుక మళ్లీ రాలేదు.

ఒకరోజు వెంకయ్య, ఏదో పనిమీద ఊరికెడుతూ, పొలాల్లోంచి పోతున్నాడు. ఒకచోట "అక్కయ్యాక్కయ్యా" అని అరుపు వినిపించింది. తన చిలుక జ్ఞాపకం వచ్చింది. అటూ ఇటూ చూడసాగాడు. "ఇదిగో, ఇక్కడ" అని పిలుపు వినిపించింది. చూశాడు. తన బుల్లిచిలుకే! పెద్దదైంది. తనదగ్గరకివచ్చి దణ్ణంపెట్టింది. వెంకయ్యకు ఎంతో సంతోషం కలిగింది.

"ఒక్కసారి మాయింటికొచ్చి నా భార్యా, పిల్లల్ని చూడరూ?" అని ఎంతో ప్రేమతో అడిగింది చిలుక.

"తప్పకుండా వస్తాను. పద," అన్నాడు, వెంకయ్య. ఇద్దరూ బయలుదేరి వెళ్లారు.

చిలుక యిల్లు ఎంతో చక్కగా వుంది. చిలుక భార్యా, యిద్దరు పిల్లలూ వచ్చి వెంకయ్యకు దణ్ణంపెట్టేరు. చిలుక భార్య గబగబా లోపలికివెళ్లి పళ్ళూ,ఫలహారాలూ తెచ్చిపెట్టింది. చిలుక పిల్లలిద్దరూ వెంకయ్యదగ్గిర కూచుని మంచి మంచి కబుర్లు చెబుతూ, ముద్దుముద్దుగా వాళ్ళకి తెలియనివి అడిగి తెలుసుకునేవారు.





సాయంత్రం అందరూ పూలతోటలో కూర్చునేవారు. తనచిలుక ఇల్లు, తోట, అంతా చూసి వెంకయ్య ఎంతో సంతోషించాడు. తను వెళ్ళవలసిన పని మర్చిపోయాడు. ఇంటిమాటకూడా మర్చిపోయాడు. నాలుగురోజులైనతర్వాత యింటి సంగతి జ్ఞాపకంవచ్చింది.

"నేనింక వెళ్లిపోవాలి, చాలా రోజులైపోయింది," అన్నాడు వెంకయ్య.

"సరే" అంది చిలుక.

"మా చిన్ని సంసారంలో మీకు అన్ని సదుపాయాలూ చేయలేకపోయాం. ఏదో, ఉన్నమట్టుకే పెట్టాం క్షమించండి." అంది, చిలుక భార్య.

"నువ్వు తప్పకుండా మళ్లీ రావాలి, తాతా" అన్నాయి పిల్లలు. ఇంతలో చిలుక లోపలినుంచి తను అల్లిన రెండు సంచులు తెచ్చి వెంకయ్య దగ్గిరపెట్టి "ఈ రెంటిలోనూ, నీకేది కావాలో తీసుకునివెళ్ళు. ఇది నా బహుమానం" అంది. అందులో ఒకటి బరువుగానూ, ఒకటి తేలిగ్గానూ వుంది. చిలుక తనకు చేసిన గౌరవానికీ, సదుపాయానికీ ఎంతో సంతోషించి వెంకయ్య తేలికైన సంచే తీసుకుని, తనకు అదే చాలునన్నాడు. సరే, వెళ్లొస్తానని చెప్పి ఇంటికి వచ్చేశాడు.

ఇంటికి వచ్చేసరికి వెంకమ్మ చాలా కోపంగావుంది. 'నన్ను వదిలేసి, ఇన్నాళ్లు ఎక్కడికి పోయావు' అని తిట్టి పోసింది. వెంకయ్య చిలుక కనబడడం దగ్గరనుంచి జరిగినదంతా చెప్పాడు. తను తెచ్చిన సంచి భార్యముందు పడేసి, చిలుక దానిని తనకు బహుమానం ఇచ్చిందని చెప్పాడు. తొందరగా విప్పి చూసింది, వెంకమ్మ. ఇద్దరికీ ఆశ్చర్యంవేసింది. అందులో ఇంకో చిన్న సంచివుంది. దాన్నిండా డబ్బులున్నై. చాల విలువైన మంచి మంచి బంగారు నగలూ, వెండిసామానులూ వున్నాయి. మంచి మంచి బొమ్మలున్నాయి. ఇవన్నీ చూసి వెంకయ్య మురిసిపోయాడు. వెంకమ్మకూడా ఆనందపడింది. కాని వెంకయ్యమీద కోపం వచ్చింది, బరువైన సంచి మానేసి తేలికసంచి తీసుకువచ్చాడని. "బరువైన సంచితెస్తే అందులో



ఇంకా ఎక్కువ డబ్బు వుండేది. నీకు తెలివి తేటలు లేవు" అని దెబ్బలాడింది వెంకయ్యతో.

వెంకయ్య "ఏదో, మనకి ఇదే చాలు" అని తృప్తిపడ్డాడు. కాని వెంకమ్మ అలా ఊరుకుంటుందా!

"సరే, ఆ చిలుక ఎక్కడుంటుందో నాకు చెప్పు. నేను వెళ్లి ఈసారి బరువైన సంచి తెస్తాను" అని పట్టుబట్టింది వెంకమ్మ. దారిచెప్పి, పంపించేడు వెంకయ్య.

వెంకమ్మ చిలుక యింటి కొచ్చింది. ఎవరూ అంతగా మర్యాదచెయ్యలేదు. చిలుకమాత్రం ఏదో కొద్దిగా మాట్లాడింది. ఏవో పళ్లుపెట్టి, సరే వెళ్ళమంది. తనకూ బహుమతీ యిస్తుందని చూచింది, వెంకమ్మ కాని, ఇచ్చేటట్టులేదు. అందుచేత తనే అడిగింది, తనకూ సంచీనిమ్మని.

వెంకయ్యదగ్గిర పెట్టినట్టే, ఒక బరువు సంచీ, ఒక తేలిక సంచీ తెచ్చి, "నీకేది కావాలో తీసుకో" అంది చిలుక. వెంకమ్మ సంతోషంగా బరువు సంచి తీసుకుని యింటికి వచ్చేసింది.

ఇల్లు చేరుకున్న తర్వాత సంచి విప్పి చూసేసరికి వెంకమ్మకు భయంవేసింది. ఎందుచేతనంటే దాని నిండా నగలు, నాణ్యాలు, డబ్బుకు బదులు తేళ్లూ, పాములూ, భయపెట్టే బొమ్మలూ వున్నై! తేళ్లు కుట్టేసాయి, వెంకమ్మని. గోలపెట్టి ఏడుస్తోంది. బొమ్మలు భయపెడుతున్నాయి. ఇంతలో ఒక పెద్దపాము, వెంకమ్మను చుట్టేసి, కాటువేసింది. వెంకమ్మ ఒక్కసారిగా నేలమీదపడి చచ్చిపోయింది.

ఇదంతా చూస్తూ వెంకయ్య వణికిపోతున్నాడు. కాని, ఆ పాములూ బొమ్మలూ, అతన్నేమీ చెయ్యలేదు. అతని దగ్గిరికే రాకుండా, వెంకమ్మ చనిపోగానే ఎక్కడి పక్కడ మాయమైపోయాయి.

ఇప్పుడు వెంకయ్యను తిట్టేవారెవరూ లేరు. ఒక పెద్ద మేడ కొన్నాడు. చిలుక ఇచ్చిన డబ్బుసంచీ, వెండి బంగారాలతో ఎంతో సుఖంగా వుంటున్నాడు. తనకు ముసలివయస్సులో సహాయంచెయ్యడానికీ, సుఖంగా వుండేటట్లు చూడడానికి ఒక పిల్లవాడిని పెంచుకుంటున్నాడు.



# న్యాయమైన తీర్పు

ఒక వూళ్లో ఒక పేదవాడు వున్నాడు. అతనికి ఇద్దరు భార్యలు. అతనికి ఆస్తి ఒక అవుతప్ప మరేమీలేదు. కష్టంచేసి అవుపాలు అమ్ముకొని జీవితం గడుపుతూ వుండేవాడు. కొంతకాలానికి అతడు అకస్మాత్తుగా చనిపోయాడు. చనిపోయే టప్పుడు అవును తన యిద్దరు భార్యల్లో ఎవరు తీసుకోవాలో చెప్పలేదు. అందువల్ల సవతు లిద్దరూ అవుకోసం తగవులాడు కోడం ప్రారంభించారు. చివరకి ఇద్దరూ కలిసి ఒక మధ్యవర్తి దగ్గరకు వెళ్లి న్యాయంగా తీర్పుచెప్పమని కోరేరు.

ఆ మధ్యవర్తి జరిగినదంతా విని, "అవు మీ భర్త ఆస్తిగనక దానిలో మీ ఇద్దరికీ సమాన హక్కువుంది! కాబట్టి ఇద్దరికీ సమాన భాగాలు రావాలి!" అన్నాడు. సవతు లిద్దరికీ అవును సమానంగా ఎలాగ పంచుకోవాలో అర్థంకాలేదు. "స్వామీ! తీర్పుచెప్పిన మీరే సమభాగాలు కూడా పంచి మా పోట్లాట తీరిస్తే మీ పేరు చెప్పుకుంటాం" అన్నారు.

ఆ మధ్యవర్తి ఒప్పుకొని అవును తీసుకు రమ్మన్నాడు. సవతు లిద్దరూ వెళ్లి అవుని తెచ్చి మధ్యవర్తి ఎదట వుంచారు. అప్పుడు మధ్యవర్తి బొగ్గుతో అవుమధ్యగా గీతగీసి రెండుభాగాలుగా చేసి "సామాన్యంగా చిన్నవాళ్ళు ముందు ఎన్నుకోడం న్యాయ పద్ధతి! కాబట్టి నువ్వు నీ ఇష్టమువచ్చిన భాగం ఎన్నుకోవమ్మా" అని చిన్నామెవైపు తిరిగి చెప్పాడు. వెంటనే ఆమె పొదుగు వైపు భాగం ఏరుకుంది. ఇంక తప్పని సరిగా పెద్ద సవితికి తలవైపుభాగం తప్ప లేదు. అయినా పెద్దమనిషి తీర్పుకు ఎదురుచెప్పలేక తిరిగి చిన్నసవతితోపాటు యింటికి వచ్చేసింది.

మధ్యవర్తి చెప్పిన తీర్పు ప్రకారం, మేత పెట్టడం పెద్ద సవితి వంతు. పాలు పిండుకోవడం చిన్నసవితి వంతు అయింది. పాపం పెద్దసవితికి అన్యాయం జరిగింది. మేత నష్టమేకాని ఫలితంలేదు. మరొక వుపాయం ఆలోచించి పూర్తిగా అవుబాధ వదలించుకోడమో లేక సవతితో పాటు సగభాగం పాలతో అనుభవించడమో జరగాలనుకొంది. మరియొక పెద్దమనిషి దగ్గరకు వెళ్లి జరిగినదంతా చెప్పి తగిన వుపాయం చెప్పమని ప్రార్థించింది. పాపం అతడు చాలా జాలిపడి ఒక చక్కని వుపాయం చెప్పాడు.

రాయప్రోలు రాజ్యలక్ష్మి, బళ్లారి





మర్నాడు మామూలుగా చిన్న సవితి చెంబుతీసుకొని పాలుపితకడానికి ఆవు దగ్గ రికి వచ్చింది. పెద్దసవితికూడా కొంచెం గడ్డి ఒక దుడ్డుకఱ్ఱ తీసుకొని వచ్చి గడ్డివేసి ఎదురుగా నిలుచుంది. చిన్నసవితి పాలు పితకటం ప్రారంభించగానే పెద్దసవితి ఆవుని కఱ్ఱతో ఒకదెబ్బ కొట్టింది. ఆదెబ్బతో ఆవు, పాలు పితుకుతున్న చిన్న సవితిని "ఫెడేలు"మని తన్నింది. పాపం ఆ తాపుకి చెంబు ఎగిరి ఎక్కడోపడింది. మోచేతికి బలమైన గాయం తగిలి అమిత కోపంవచ్చి పెద్దపెట్టున తిట్టడం ప్రారంభించింది. ఆ తగవులాట విని చుట్టు పక్కల వాళ్ళంతా వచ్చి "తగవులాట కారణం ఏమిటి?" అని అడిగారు.

చిన్నసవితి వుక్రోషం పట్టలేక "నేను పాలు పిండుకొంటుండగా ఆవును కొట్టి పాలు ఇవ్వకుండా చేసింది" అని చెప్పింది.

తరువాత పెద్దసవితి మొదటనుంచి జరిగిన కథంతా చెప్పి, "నా భాగాన్ని నా యిష్టంవచ్చినట్లు చేసుకొంటాను. నేను కొట్టితే తనకేమి? చంపితే తనకేమి? ఆమె భాగం నేను ముట్టలేదు. పాలు పిండుకోవద్దని చెప్పలేదు." అంది.

వచ్చినవాళ్లంతా ఆమె ఉపాయానికి ఆశ్చర్యపడి, ఇద్దర్నీ సమాధానపరచి చెరి ఒక పూట ఆవు పాలు పిండుకొనేటట్లూ, చెరి ఒక పూట ఆవుకు మేతవేసేటట్లూ తీర్పు చెప్పి వెళ్ళిపోయారు. ఆరోజునుంచి ఇద్దరు సవతులూ మంచితనంగా కాలం గడుపుతున్నారు.






అనగనగా ఒక రాజు వుండేవాడు. అందరి రాజులలాగానే మన రాజుగారింట్లో కూడా లెఖ్ఖలేనంత డబ్బూ, రత్నాలు, మొహరీలు, వెండిగిన్నెలు, బంగారు గిన్నెలు ఒక టేమిటి విలువైన వస్తువులన్నీ వున్నై. రాజుగారిదగ్గిర ఎంతోమంది నౌకర్లు, చాకర్లు కూడా వుండేవారు. ఇంతమంది వున్నా, ఎప్పుడూ రాజుగారింటో దొంగతనం జరగలేదు. అసలా రాజ్యంలోనే ఎన్నడూ దొంగతనం జరగలేదు. హాయిగా రాజ్యం ఏలుతున్నాడు రాజు.

ఇలావుండగా ఒకరోజున రాజుగారి యింట్లో ఒక బంగారపుగిన్నె పోయింది. ఎన్నడూ తనయింట్లో దొంగతనం జరిగి వుండకపోవటంచేత రాజుగారు గిన్నె పోయేసరికి చాల విచారించారు. 'దొంగని పట్టటం ఎలాగా ?' అని ఆలోచించటం మొదలెట్టారు. అలా ఆలోచించగా, ఆలోచించగా రాజుగారికి ఒక చక్కటి యుక్తి తోచింది.

వెంటనే తన నౌకర్లందరినీ పిలిపించారు. అంతా వచ్చి రాజుగారి ఎదట నిలబడ్డారు.

"ఇన్ని సంవత్సరాలనించీ రాజ్యం ఏలుతున్నా, ఎన్నడూ నా రాజ్యంలో దొంగతనం జరగలేదు. అలాంటిది యివ్వాళ వున్నట్టుండి నా యింట్లోనే బంగారపు గిన్నె పోయింది. ఈ దొంగతనం చేసింది ఎవరో బైటపడతారా లేదా?" అని రాజు గద్దించి అడిగాడు. నౌకర్లందరూ ఎవరి మటుకు వారు 'మాకు తెలియదు' అంటే 'మాకు తెలియదు' అన్నారు.

అప్పుడు రాజుగారు పదేసి అంగుళాల పొడుగుగల కర్రపుల్లలు వాళ్లందరికీ తలా ఒకటి యిచ్చాడు. యిచ్చి, "మీలో ఎవరైతే గిన్నె దొంగిలించారో వాళ్ల కర్రపుల్ల రేపు తెల్లవారేసరికి ఒక అంగుళం పెరుగుతుంది. మీరంతా మళ్లీ రేపు వుదయం మీ మీ కర్రపుల్లలను నాకు చూపించాలి. ఎవరి కర్రపుల్ల పెరిగివుంటే వాళ్లు దొంగతనం

భాగవతుల కృష్ణమూర్తి, విశాఖపట్టణము

చేసినట్లు తేలుతుంది" అన్నాడు. సరేనని అంతా తలొక కఱ్ఱపుల్ల తీసుకుని యిళ్లకు వచ్చేశారు.

గిన్నెను దొంగిలించిన నౌకరు యిలా అనుకున్నాడు - "గిన్నె దొంగిలించింది నేనేగనక నా కఱ్ఱపుల్ల రేపు ప్రొద్దుటికి అంగుళం పెరుగుతుందిగదా! అందుకని యిప్పుడే ఒక అంగుళం ముక్క నా కఱ్ఱపుల్లలో కోసివేశానంటే తెల్లవారేసరికి మళ్లీ మామూలుగా పది అంగుళాలే వుంటుంది గదా! ఇంక రాజుగారు నేనే దొంగతనం చేసినట్లు ఎలాగు కనుక్కుంటారు?" అని. ఇలా అనుకుని ఆ నౌకరు తన కఱ్ఱపుల్లలో ఒక అంగుళం ముక్క కోసివేసి నిశ్చింతగా నిద్రపోయాడు.

తెల్లవారి అందరితోపాటు ఈ నౌకరు కూడా రాజుగారి ఎదటికి వెళ్ళాడు. అందరి కఱ్ఱపుల్లలూ అదివరకటిలాగానే పది అంగుళాలు వున్నై. పాపం మన నౌకరు కఱ్ఱపుల్ల తొమ్మిది అంగుళాలే వుండటం చేత రాజుగారి చేతులో పట్టుబడిపోయాడు. వాడు తను చేసినదంతా బైటపెట్టి గిన్నె తిరిగి తెచ్చి యిచ్చేశాడు. తర్వాత రాజు ఆ నౌకరుకు శిక్షవిధించి జైల్లోవేశాడు.

చూశారా! యుక్తివల్ల ఎలాంటి కఠినమైన పని అయినా సాధించవచ్చు.

# మేలుకొలుపు



జాజిపూల జలకమాడి
పాలవెల్లి పాలకెక్కి
అత్తయింట నడుగుపెట్టి
మొగుడురాగ మొగముదాచి
ఎందుకింత సిగ్గుపడుదు
వేలనీకు ఇంతసిగ్గు?
తాడిచెట్టు తలనుదన్ని
తాతనీడ తరిగిపోయె
నిదురలెమ్ము నిమ్మకాయ
కళ్లువిప్పు కందపిలక
త్వరగలెమ్ము తల్లిగాదె
చిలుకవచ్చి చెట్టుమీద
పిలుచుచుండె పిల్లనిన్ను
వేగ లెమ్ము వెన్న యిదిగొ
కిత, కిత, కిత, కిత, కిత, కిత.



సంపాదనః
రంధి సోమరాజు, రాజమండ్రి

# అంతా శనిమహిమ!

శనిని గురించి మనపెద్దలు ఎన్నో రకరకాల, ఆశ్చర్యమైన కథలు చెబుతూ వుంటారు. వాటిలో కొన్నయినా మీరు విని వుంటారు. శనిపట్టినవారికి అనేక కష్టాలు కలుగుతాయనీ, శని వదిలిపోయిన వెంటనే ఆ కష్టాలుకూడా మాయమవుతాయనీ మనవాళ్ళు చెబుతూవుంటారు. ఇప్పుడు అలాటిదే ఒక కథ నేను చెబుతాను వినండి.

అనగనంగా ఒక బ్రాహ్మడుండేవాడు. అతనికి జ్యోతిష్యం చెప్పడం బాగావచ్చు. అందుచేత తనకు ఏరోజున ఏమికష్టం రాబోతోందో ముందుగా తెలుసుకుని జాగ్రత్త పడుతుండేవాడు.

ఒకనాడు ఆయన ప్రశ్న చూచుకోగా తనకు ఏలినాటిశని ఉందని తెలుసుకున్నాడు. ఏలినాటిశని అంటే శని ఏడున్నర సంవత్సరాలు విడవకుండా మనుష్యుని పీడించడమన్నమాట. మన బ్రాహ్మడు ఈసంగతి తెలుసుకొని, అతనువచ్చి పట్టకముందే శనినిగురించి తపస్సుచెయ్యటం మొదలెట్టాడు. అలా తపస్సుచెయ్యగా, చెయ్యగా ఒకనాడు అతనికి శని కలలో కనపడి ఏమికావాలని అడిగాడు.

అప్పుడు బ్రాహ్మడు, "ఏమీ లేదు మహాత్మా! నీవు నన్ను ఏడున్నర సంవత్సరాలపాటు పీడించదలుచుకున్నట్లు తెలుసుకున్నాను. అలా పీడించకుండా నన్ను వదిలెయ్యమని కోరుతున్నాను" అన్నాడు.

"అదెలా కుదురుతుంది? కావలిస్తే నువ్వు యింతగా ప్రార్థించావు గనక నేను నిన్ను ఏడున్నర సంవత్సరాలబదులు మూడున్నర సంవత్సరాలు మాత్రమే పీడిస్తాను" అని చెప్పి శని మాయమైపోయాడు.

మన బ్రాహ్మడికి అప్పటికీ తృప్తికలగలేదు. మళ్లీ మొదలెట్టాడు తపస్సు. అదివరకటిలాగే మళ్లీ శని కలలో ప్రత్యక్షమై, "ఏమయ్యా బ్రాహ్మడా! ఇంకా ఏమైనా వరాలు కావాలా ఏమిటి? మళ్లీ తపస్సు సాగించావ్?" అని అడిగాడు.

"వరాలు అంటూ ఏమీలేవు. నీపీడ ఎలాగైనా నాకు లేకుండా చెయ్యమని కోరుతున్నాను" అన్నాడు బ్రాహ్మడు.

"వీలులేదయ్యా. ఒక్క ఏడాదిపాటు మాత్రం పీడిస్తాను" అని చెప్పి మాయమయ్యాడు శని.

కాని బ్రాహ్మడు అంతటితో తృప్తిపడి పూరుకుంటేనా! మళ్లీ మళ్లీ తపస్సు

వంగపండు అంగార్కరావు, రాజమండ్రి



చెయ్యటం మొదలెట్టాడు. ఆఖరికి శని ఒక రోజు ప్రత్యక్షమై, "ఏమయ్యా, బ్రాహ్మడా! పాపంగదా అని ఏడున్నర సంవత్సరాలు పీడించటానికిబదులు ఏడాదితోటే వదిలి పెడతానని వరం యిచ్చినందుకా యింకా నా వెంటబడి వేధిస్తున్నావ్? ఇదే నా ఆఖరి వరం. ఏడుఘడియలన్నా నిన్ను పీడించ కుండా వదలను. ఇది ఖాయం. ఈసారి నువ్వు ఎన్నేళ్ళు తపస్సు చేసినాకూడా నేను నీకు కనిపించను. మర్యాదగా ఈ వరంతో తృప్తిపడు" అని చెప్పి మాయ మైనాడు. సరే, పాపం ఏంజేస్తాడు బ్రాహ్మడు. ఆ ఏడుఘడియల కాలమూ ఎలాగో శని పీడ తప్పదుగదా అని ఎలాగో బాధపడదా మనుకున్నాడు.

* * *

కొన్ని రోజులు గడిచినై. బ్రాహ్మడికి శని పట్టేరోజు వచ్చింది. అయినా బ్రాహ్మడికి శనిపీడ ఎలాగైనా తప్పించుకోవాలని ఆశ ఇంకా పోలేదు. ఆలోచించాడు తను వూళ్లో వున్నట్లయితే తనవల్ల వూళ్లో వాళ్లెవరికైనా గానీ, వూళ్లో ఎవరివల్లనైనా తనకుగానీ ఆపదరావచ్చు. అందుచేత ఎవ్వరూ వుండని అడవిలోకివెళ్లి ఒంటరిగా ఆ ఏడు ఘడియల కాలమూ గడిపేస్తే శని తనని పీడించలేడుగదా అనుకున్నాడు.

ఇలా అనుకుని బ్రాహ్మడు తన మడి సంచి ఒకటి చేతబుచ్చుకుని అడవికి చేరుకున్నాడు. ఎండ చాల తీవ్రంగావుంది. దాహంవేస్తుండటంచేత అచుట్టుప్రక్కల ఎక్కడైనా మంచినీరు దొరుకుతుందేమో నని బయలుదేరాడు. అలా పోతుండగా ఒక పుచ్చకాయలతోట కనిపించింది. ఆ తోటకాపరిని అడిగి ఒక పుచ్చకాయ తీసుకుని దాంట్లో సగంతిని మిగతా సగం తన సంచీలో పెట్టుకుని మళ్లీ బయలుదేరి పోతున్నాడు. అలా పోతూవుండగా ఒక పాడుపడిన గుడి కనిపించింది. అక్కడ జపం చేసుకుంటూ కూర్చున్నాడు.

సరిగ్గా అప్పుడే శని అతనిని పట్టాడు. పాపం ఆసంగతి బ్రాహ్మడికేంతెలుసు? నిశ్చింతగా జపం చేసుకుంటున్నాడు.





ఇంతలో ఆ అడవిప్రక్కనవున్న రాజు గారి కొడుకు కనిపించలేదని, రాజుగారి భటులు వెతుక్కుంటూ బ్రాహ్మడు కూర్చున్న గుడివైపు వచ్చారు. బ్రాహ్మడిని శని పట్టాడుగదూ! అందుకని బ్రాహ్మడి సంచిలోవున్న పుచ్చకాయనించి కారుతున్న నీరు సంచినితడిపి నెత్తురుతో తడిపినట్టుగా కనిపించేట్లు చేసింది రాజుగారి భటులకు.

భటులు ఆశ్చర్యపోయి ఆసంచీ విప్పి చూశారు. ఇంకేముందీ! శని మహిమవలన దాంట్లో వున్న పుచ్చముక్క వాళ్ళకళ్ళకి రాజకుమారుడి తలలాగా కనిపించింది.

వెంటనే భటులు బ్రాహ్మడిని ఆ సంచి తోపాటు రాజుగారి ఎదటికి లాక్కెళ్లారు. శనిగాడి మహిమవలన రాజుగారికికూడా పుచ్చముక్క ,తన కొడుకు తలలాగే కనిపించింది. ఇంకేం! "చూస్తారేం, తీసికెళ్లి కొరతవెయ్యండి ఈ పాపాత్ముణ్ణి" అని భటులని ఆజ్ఞాపించారు రాజుగారు కళ్ళ వెంట నిప్పులుగక్కుతూ.

పాపం, పుణ్యం ఎరగని బ్రాహ్మడికి చూశారా, శనిపట్టేసరికి ఎలాంటి ప్రమాదం వచ్చిందో! భటులు బ్రాహ్మడిని కొఱతవేసే చోటికి తీసుకువెళ్లారు.

అప్పటికి శని బ్రాహ్మడిని పీడిస్తానన్న ఏడు ఘడియలూ పూర్తిఅయినై. ఏడో ఘడియ పూర్తికావట మేమిటీ, అప్పటి వరకూ రాజుకొడుకు తలలా కనిపిస్తున్న పుచ్చముక్క పుచ్చముక్కలా కనిపించట మేమిటీ ఒక్కసారిగా జరిగినై. అంతేకాదు; ఎక్కడో ఆడుకోటానికని పోయిన రాజు కొడుకుకూడా అక్కడికి చేరుకున్నాడు. ఇదంతాచూసి రాజు చాల ఆశ్చర్య పోయాడు.

కొఱత ఆపివేయించి, యిలా జరగ టానికి కారణమేమిటని బ్రాహ్మడిని అడిగారు. మొదటినించీ జరిగినదంతా బ్రాహ్మడు పూసగ్రుచ్చినట్లు చెప్పి "అంతా శని మహిమ" అన్నాడు.

రాజు బ్రాహ్మడి జ్యోతిష్య పాండిత్యానికి ఎంతో మెచ్చుకుని ఆరోజునించీ అతనిని తన ఆస్థాన జ్యోతిష్కునిగా వుంచుకున్నాడు.



# మినుముల బ్రాహ్మడు

అనగా అనగా ఒక వూళ్లో ఒక బీద బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆ బ్రాహ్మణుడు ప్రతి రోజు ప్రొద్దున్నే లేచి స్నానం జపంచేసి, ఎర్రగా రాగిచెంబు తోముకుని వూళ్లో యాయవారానికి బయలుదేరేవాడు. ఇల్లిల్లూ అడుక్కుని పన్నెండు గంటలయ్యేటప్పటికి భుజాన బియ్యంమూట వేసుకొని ఇల్లు చేరుకునేవాడు. బ్రాహ్మణుడి భార్య గయ్యాళిగంప. ప్రొద్దస్తమానమూ భర్తను ఎందుకో ఒకందుకు వేధిస్తూనే వుండేది. ఇలా కొంతకాలం జరిగేటప్పటికి ఏమయిందంటే రోజూ వచ్చే బ్రాహ్మణుడే కదా ఇతనికి బియ్యం ఎందుకని ఆ వూళ్లో వాళ్లు ఒకరిని చూచి ఒకరు అందరూ మినుములు బిచ్చంవెయ్యడం ప్రారంభించారు. గతిలేనివారికి గంజే పానకం అన్నట్లుగా ఆ బ్రాహ్మణ దంపతులు మినుములే కుడుములు చేసుకుతింటూ కాలక్షేపం చేసేవారు.

ఒకరోజున ఆ బ్రాహ్మణుడి పెళ్లానికి అరిసెలు తినాలని మనసైంది. మామూలుగా బ్రాహ్మణుడు యాయవారానికి బయలుదేరుతుండగా 'ఏమండోయ్! యివాళ నాకు అరిశెలు తినాలని మనసైంది. కాబట్టి మినుములు మానేసి బియ్యం తీసుకురండి. లేకపోయారంటేనా..." అంది.

సరేనని బ్రాహ్మణుడు వూళ్లోకి బయలుదేరాడు. అందరూ మినుములు వేసేవారే కాని బియ్యం ఒక్కరూ వెయ్యలేదు. ఏఒక్కళ్లనికూడ బియ్యం వేయమని అడగలేక ఇంటిముఖం పట్టాడు. బ్రాహ్మడి పెళ్లాం తన మొగుడు ఎప్పుడు వస్తాడా, ఎప్పుడు అరిసెలు వండుకు తిందామా అని నోరూర్చుకుంటూ, గంపెడాశతో కూచుంది. ఇంతలో బ్రాహ్మణుడు మినుములమూట పుచ్చుకొని ఇంటికి జేరాడు. వచ్చీరాకుండగానేఅతిసంతోషంతో అరిశెలు చేసుకోవచ్చుగదా అని గబగబ అవిడ మూట విప్పింది. విప్పేసరికల్లా రోజులాగా మినుములే. దానితో అవిడ నరసింహావతారం అయిపోయి పళ్లు పటపట

యస్. సి. సీతమ్మాళ్, ఏలూరు



కొరుకుతూ మూలనున్న రోకలి పుచ్చుకొని "బియ్యం తెమ్మంటే తేలేనివాడవు ఏం మొగాడవయ్యా! నామాట అంటే నీకు అంత చులకనా; ఎవరు తింటారు ఇవన్నీ" అంటూ మండిపడడం మొదలుపెట్టింది. పాపం బ్రాహ్మణుడు గుడ్లు మిటకరించి చూడ్డంతప్ప మరేమి చెయ్యలేకపోయాడు.

"ఎన్నాళ్ళనుండో అరిశెలు తినాలని వుంది ఇవాళ బియ్యం తెమ్మంటే తేక, నాకు అరిశెలు చేసుకుతినే భాగ్యం లేకుండా చేసావుగదా! సరే నీ పని ఏం చేస్తానో చూడు. ఇవన్నీ వండి నీ మొహాన పడేసి తినేదాక ఈ రోకలి పుచ్చుకొని నీ ఎదట కూర్చుంటాను. తినక పోయావంటే గుండు పగలేస్తాను చూడు" అంది.

"పోనీ ఎలాగో అలాగ తిప్పలుపడి తింటే ప్రస్తుతం రోకలిదెబ్బలు తప్పుతైగదా అనుకొని బ్రాహ్మణుడు "అలాగే తింటాను, వండి పట్టుకురా" అన్నాడు.

ఆవిడ ఆ మినుములన్నీ వండి పెద్ద విస్తరేసి దాన్నిండా ఆ వండిన మినుము లన్నీ పోసి, తినమని రోకలి పుచ్చుకొని దగ్గర కూచుంది–"ఓరి దేవుడా ఇవన్నీ తినడం ఎలా? నాది కడుపా చెఱువా! ఇవన్నీ ఎక్కడ పట్టించనూ..." అనుకుంటూ గట్టిగా మాట్లాడితే రోకలితో పెళ్ళాం ఏం పెళ్లి చేస్తుందో అన్న భయం కొద్దీ బ్రాహ్మడు ఆ విస్తరి దగ్గర కూలబడి ఒక్కొక్క గింజే తినడం మొదలెట్టాడు. ఇలా సగం మినుములు తినేసరికి అయ్య గారికి గుడ్లెళ్ళుకొచ్చినై.



"ఒసే గొంతుక దిగడంలేదు, మంచి నీళ్లు తెద్దూ" అన్నాడు. నీళ్ళు తేవడానికని రోకలి అక్కడ పడేసి ఆమె లోపలికి వెళ్లింది. ఇదే సమయం అనుకుని





బ్రాహ్మణుడు యిల్లువదిలి వెనక్కి తిరిగి చూడకుండా వీధివెంట బడ్డాడు.

పెళ్ళాం ఎక్కడ తరుముకుంటూ వొస్తుందో అన్న భయంకొద్దీ బ్రాహ్మడు తనకాళ్లు ఎలా ఈడ్చుకుపోతే అలా పరిగెత్తి, పరిగెత్తి, చివరికి సాయంత్రం అయేసరికి ఒక అడవిలోకి చేరుకున్నాడు. నాలుగు ప్రక్కల చూచి, గుండె స్థాయిపరుచుకొని, రోకలిపోట్లు తప్పాయిగదా అని సంతోషించి అలసివుంటంచేత ఒక మర్రిచెట్టు క్రింద పడుకొని నిద్రపోయాడు.

ఇది ఇలా వుండగా నలుగురు దొంగలు ఒక వర్తకుడి ఇంట్లో పడి సర్వం దోచుకొని అర్ధరాత్రి అయేసరికి బ్రాహ్మణుడు పడుకొన్న అడవిలో ఆ మర్రిచెట్టుప్రక్కనే జేరారు. అక్కడ కాసేపు ఆగి మళ్ళీ వెళ్దామనుకొని తమ సామానంతా అక్కడ దింపారు. వాళ్ళకి చాల ఆకలేసింది. తినడానికి యేదైనా దొరుకుతుందేమోనని వాళ్లు తమ సామానంతా కలియ వెదికారు. వెదకగా వాళ్లకో కొబ్బరికాయ దొరికింది. కాయ పగలకొట్టడానికి ఏదన్నా రాయి వెదకండర్రా అంటూ ఆ చీకట్లో నలుగురు నాలుగు ప్రక్కల తడమటం మొదలెట్టారు. తడమగా, తడమగా, ఒకడి చేతికి బ్రాహ్మణుడి గుండు నున్నంగా తగిలింది. దొరికిందిరండర్రా, అంటూ మిగతా వాళ్లని అందరిని పిలిచాడు. నలుగురూ జేరారు. అది బ్రాహ్మణుని తల అని వాళ్లకేంతెలుసు! బలంకొద్దీ బ్రాహ్మణుడి గుండుకేసి ఆ కొబ్బరికాయ కొట్టారు!! గుఱ్ఱుపెట్టి నిద్రపోతున్న బ్రాహ్మణుడు, ఆ దెబ్బకి హడలిపోయి లేచి, తన పెళ్ళామే తనని వెతుక్కుంటూ వచ్చి కోపంకొద్దీ రోకలి పుచ్చుకు కొట్టిందనుకొని, "వస్తున్నా - వస్తున్నా; తింటాను, తింటాను, అగు,

అగు," అని వెర్రికేక లెయ్యడం మొదలు పెట్టాడు. ఆ అరుపులు వినగానే దొంగలు అది దయ్యమో, భూతమో అని వెనకా ముందూ చూడకుండా వాళ్లు దోచుకుని తెచ్చిన సామానంతా అక్కడే వదిలేసి అదే పరుగుతీశారు.

ఇంతలో తెల్లవారొచ్చింది. బ్రాహ్మణుడు జరిగినదంతా తెలుసుకొని దొంగలు వదిలి వెళ్ళిన పెట్టెలన్నీ నిమ్మళంగా ఒకటొకటే తెరిచి చూసాడు. వాటిల్లో బోలెడన్ని నగలు నాణాలు, వున్నై. "భలే అదృష్టం. గుండు చితికేలా దెబ్బతింటే తిన్నానుగాని, ఎంతటి అదృష్టం కలిసివచ్చిందో" అనుకున్నాడు. సరే అవన్నీ పుచ్చుకొని ఇంటికి బయలుదేరాడు.

ఇక అక్కడ ఇంటిదగ్గర ఏమయిందంటే మంచినీళ్ళు తెద్దామని లోపలికి వెళ్ళి పట్టుకొచ్చేలోగా, మొగుడు లేకపోయేసరికి "అమ్మ గడుసువాడా, ఎంత మోసం చేసావు! కాని రాని, ఎప్పటికైనా రాక పోతావా. చూడు రాగానే నీ పని పట్టిస్తా', నంటూ దుడ్డుకర్ర పుచ్చుకొని తలుపు వేసుకొని కూచుంది.

మరి కాస్సేపటికి "తలుపే తలుపు" అంటూ బ్రాహ్మణుడు ఇంటికొచ్చి దబదబా తలుపు బాదాడు.



"అఁ, వచ్చావా! నీ పని అయిపోయింది వస్తున్నా వుండు" అంటూ ఆవిడ ధఖాలున తలుపు తెరచింది. తలుపు తెరవగానే బోలెడన్ని పెట్టెలు, బేడలు, సామాను చూసేసరికి ఆవిడ కోపమంతా ఒక్కసారిగా సంతోషంగా మారిపోయింది.

అనందంతో భర్తని లోపల కాహ్వానించింది. భర్త పెట్టెలుతెరిచి చూపించాడు. దరిద్రం వదలిందంటూ అనాటినుంచీ ఆ బ్రాహ్మణదంపతులు సుఖంగా జీవించారు.

కథ కంచికి మన మింటికి.



# విద్వాంసుడు

ఒకానొక పట్టణంలో ఒక గొప్ప తార్కికుడు, విద్వాంసుడు వుండేవాడు. ఆయన తెలివి తేటలకు, విద్యకు చాలా ప్రసిద్ధి చెందాడు. ఇంతేకాక ఆయనకుకూడా తన తెలివి తేటలను గురించి చాలా గర్వం వుండేది. సాధారణంగా ఆయనతో వాదించటానికి ఎవరూ వచ్చేవారుకాదు. ఆ పట్టణంలోని వారందరూ ఆయన్ను చాలా గౌరవిస్తూ వుండేవారు. ఎవరూ ఆయనతో సమాన హోదాలో కూర్చొనేవారుకాదు. ఆయన కుర్చీలో కూర్చుంటే అందరూ క్రింద కూర్చునేవారు.

ఒకనాడు ఆయన తన యింటివద్ద సోఫాలో కూర్చొనివున్నాడు. ఆ సమయంలో దారిన పోతూవున్న బిచ్చగాడు ఒకడు అక్కడకు వచ్చి ఆయన ప్రక్కనే సోఫాలో కూర్చున్నాడు.

ఇది చూసి విద్వాంసుడికి చాలా కోపం వచ్చింది. ఇంతవరకు ఎవరుకూడా అతని సరసన కూర్చోటానికి సాహసించలేదు. ఒక సామాన్యమైన బిచ్చగాడు ఈపని చేయటం అతను సహించలేకపోయాడు. కోపం ఆపుకోలేకపోయాడు.

"మూర్ఖుడా నీకూ పశువుకూ తేడా ఏముంది? " అని విద్వాంసుడు అడిగాడు.

బిచ్చగాడు వెంటనే తనకూ ఆ విద్వాంసునకు మధ్యవున్న స్తలాన్ని కొలిచి, "అయ్యా! నాకూ పశువుకూ ఒక అర్ధ గజము తేడావుంది" అన్నాడు.

ఈ సమధానం విని విద్వాంసుడు తెల్లపోయాడు. నోట మాట రాలేదు.

ఈదర రాధ, అయితానగర్, తెనాలి.




అనగనగా ఒకవూళ్లో ఒక పేద బ్రాహ్మణు డుండేవాడు. అతను కుటుంబం పోషించటానికి చాలా కష్టపడుతుండేవాడు. ఈ కష్టాలు భరించలేక చివరకు చచ్చిపోదామనుకున్నాడు. యీ సంగతి ఆయన భార్య కనిపెట్టి "యేమండీ? నూరేళ్లు బ్రతకాల్సిన యీ ప్రాణాన్ని చేతులార తీసుకోవటం తెలివితక్కువ కాదా! కాబట్టి ప్రక్క వూళ్లోవున్న రాజుగారిని ఆశ్రయించండి. ఆయన తప్పక మనకు సహాయంచేస్తాడు." అని అంది. దాంతో ఆయన గంపంత మొహంచేసుకొని రాజుగారి ఆస్థానానికెళ్లి ఆయన్ను రోజూ దీవించి వస్తుండేవాడు.

కాని రాజుగారిని తనకు ఫలానిది కావాలని అడిగేవాడుకాదు. తనను యేమీ కోరకుండా రోజూ వచ్చి దీవించిపోవటం రాజుగారికి ఆశ్చర్యం కలిగించింది. ఒక రోజు మామూలుగా వచ్చి దీవించిపోతుంటే రాజుగారు బ్రాహ్మణ్ణి పిలచి "మీరు ప్రతి రోజు మా ఆస్థానానికొచ్చి మమ్ము ఆశీర్వదించి యేమీ కోరకుండా వుట్టినే వెళ్ళుతున్నారు యెందువల్ల?" అన్నాడు.

అప్పుడు బ్రాహ్మణుడు "అయ్యా! నేను మిక్కిలి పేదరికముచేత బాధపడుతున్నాను. కుటుంబపోషణ జరుగక యీ వూరు వచ్చాను" అన్నాడు.

"అయితే నీకేమి కావాలో అడుగు" అన్నాడు రాజుగారు.

"ప్రభువులు నాకేమీ యివ్వనక్కరలేదు. ఒక్క కోరికమాత్రం వుంది. అగ్రహం చెందకున్న దేవరవారికి చెప్పుకుంటాను." అన్నాడు బ్రాహ్మడు.

దీవి భానుమతీ దేవి





"నీకు కావలసినకోరికనుకోరుకో నేను నెరవేరుస్తాను." అన్నాడు రాజుగారు.

"మహారాజా! మీరు రాజకీయ దురంధరులు. మీకు యేదైనా సలహా కావలసినపుడు, నావైపు చూడండి. అప్పుడు మీ చెవిదగ్గర నా నోరుపెట్టి వెళ్లిపోతాను." అన్నాడు బ్రాహ్మడు. అర్థంలేని యీకోరికను విని బ్రాహ్మణుడు వట్టి మూర్ఖుడని తెలుసుకొని రాజు సరేనన్నాడు.

అదిమొదలుకొని రాజుగారు యేదయినా ఆలోచించాల్సివస్తే బ్రాహ్మణుని వైపు చూచేవాడు. బ్రాహ్మణుడు వెంటనే తన నోటిని రాజుగారి చెవిదగ్గర పెట్టేవాడు. రాజుగారు మాత్రం తన యిష్టప్రకారం తన పనులను చేసుకొనేవాడు.

ఈ విధంగా కొన్నిరోజులు జరిగిపోయినాయి. ప్రతివారు తమ కష్ట సుఖాలను రాజుగారితో చెప్పుకుంటుండేవారు. అప్పుడు రాజు బ్రాహ్మణునివైపు చూడటం-బ్రాహ్మణుడు రాజుగారి చెవిదగ్గర నోరు పెట్టి వెళ్లిపోవటం చూచి, రాజుగారు అన్ని విషయాలు యీ బ్రాహ్మణుడి సలహాతోనే చేస్తున్నాడని అనుకొని రాజుగారి సహాయం కావలసినవారంతా ముందు వారి కష్టసుఖాలు యీ బ్రాహ్మణునితో చెప్పుకోవటం మొదలెట్టారు. అప్పుడు, "మీరు వెళ్లి రాజుగారితో చెప్పుకోండి, నాచేతనయినసహాయం నేను చేస్తాను. తర్వాత మీ అదృష్టం" అనేవాడు బ్రాహ్మడు. ప్రతివాళ్లు బ్రాహ్మణునకు యేదో బహుమతి యిస్తుండేవారు.





యీ బహుమానాలతో కొంతకాలానికి యీ బ్రాహ్మణుడు రాజుగారి మేడతో సమానమయిన మేడను కట్టించాడు.

ఒకరోజు సాయంకాలం రాజుగారు మంత్రితో షికారెళ్లుతూ "యీ క్రొత్త మేడ యెవ్వరి" దని అడిగాడు.

"రోజూ మన అస్థానానికి వచ్చే బ్రాహ్మణుడిది" అన్నాడు మంత్రి.

"అరె! అతనికి నేను ఒక్క కాని యివ్వలేదే! యింతపెద్ద మేడ యెలా కట్టగలిగాడు ?" అన్నాడు రాజు.

దానికి మంత్రి "మీరిచ్చిన వాగ్దానము వలననే, యింత మేడకట్టాడు." అన్నాడు.

అంత రాజుగారు తన పొరపాటును గ్రహించుకొని మరునాడే బ్రాహ్మణుని పిలిపించి "ఏమయ్యా బ్రాహ్మడా, నీకు నేను కానీకూడా యివ్వలేదే? యింత పెద్ద మేడ యెలాకట్టావు ?" అని అడిగాడు.

"అంతా తమ అనుగ్రహంవల్లనే". అన్నాడు బ్రాహ్మణుడు.



రాజుగారు వెంటనే "యిలాంటి కుట్రపనులు ఇకముందు చేశావంటె శిక్షిస్తాను జాగ్రత్త. ప్రజలను మోసం చేయకుండా జీవించు" అన్నాడు.

అప్పటినుండి బ్రాహ్మణుడు బుద్ధిగల్గి మోసంచేయటం మానుకొని ప్రజాసేవ చేస్తూ హాయిగా కాలంగడుపుతున్నాడు.

ఈకథ విన్నవాళ్ళకు వీశెడు బంగారం, చెప్పినవాళ్లకు చాటెడు బంగారం. కథ కంచికి మనం మనయింటికి.



# అక్బరు కల

మొగలాయీ రాజులలో గొప్పవాడయిన అక్బరుపేరు మీరందరు వినేవుంటారు. అతను చదువుకొన్నవాడు కాకపోయినా చాల నేర్పుకలవాడు. వాని దర్బారులో చాలమంది పండితులు ఉండేవారు. అందులో ఒకడు వీరబల్. మాటల్లో వానిని ఎవరూ ఓడించలేకపోయేవారు. అఖరుకు అక్బరుకి అతనిని ఎలాగైనా ఓడించాలని బుద్ధిపుట్టింది. అందుచేత ఒకరోజున అక్బరు అతన్నీ ఇంకా కొంతమందినీ తీసుకొని షికారు బయలుదేరాడు.

కొంతదూరము పోయినతరువాత వీరబల్‌తో "నిన్న తెల్లవారుజామున నాకు ఒక కలవచ్చింది" అన్నాడు అక్బరు.

"ఆ కల ఏమిటి మహాప్రభూ!" అని అడిగాడు వీరబల్.

"కల చెబుతాగాని దానిలో ఉండే మంచి చెడ్డలు తీసుకోకూడదు." అన్నాడు అక్బరు. "సరే ఆలాగే" అన్నాడు వీరబల్.

"మేమూ నువ్వు ఈలాగే షికారు వెడుతున్నామట. వెళ్లగా వెళ్లగా ఒక బయలు. ఆ బయలులో పెద్దపెద్ద కుండలు కనిపించాయట! ఆ కుండలలో కొన్ని పాలతోను, కొన్ని నేతితోను, కొన్ని తేనెతోను, కొన్ని సారాతోను, కొన్ని బురదతోను, కొన్ని తుక్కుతోను, కొన్ని కుళ్లు నీటితోను నిండి ఉన్నాయట! అప్పుడు ఒక పెద్దగాలి దుమ్ము వచ్చి నన్ను తేనెకుండలోను నిన్ను బురదకుండలోను పడేసిందిట! ఇంతలోకే నాకు మెళుకువ వచ్చింది" అని అక్బరు తన కల చెప్పాడు.

తనని ఏడిపించటానికే అక్బరు ఇలా చెప్పాడని వీరబల్ గ్రహించాడు. అతను

ఎఱ్ఱమెల్లి సీతాదేవి, రాజమండ్రి



మాత్రం తక్కువ తింటేగా! "నాకుకూడా సరిగ్గా ఇలాటి కలే వచ్చింది. కాని చివర మాత్రం కొంచెం తేడావుంది" అన్నాడు వీరబల్.

"సరే నీ కల ఏమిటో చెప్పు" అని నవ్వుతూ అడిగాడు అక్బరు.

"సరిగ్గా మీరు చెప్పినట్టే నేను బురద కుండలోను మీరు తేనెకుండలోను పడ్డాముట. తరువాత ఎంతో కష్టపడి యిద్దరమూ బయటకు వచ్చాముట. తరువాత ఒకరిని ఒకరము నాకుకోడం మొదలు పెట్టాముట. నేను మీ వంటి తేనె అంతా నాకానుట! మీరు నా వంటి బురద అంతా నాకారుట" అని చెప్పాడు వీరబల్.

ఇది వినేసరికి అక్బరుకు కోపంవచ్చి వీరబల్‌ను ఖైదుచెయ్యమన్నాడు. కాని వీరబల్ వెంటనే "మహాప్రభూ! నేను చెప్పింది కల అని ముందే మనవిచేశాను. 'కలలోని మంచిచెడ్డలు తీసుకొనకూడదు' అని మీరే అన్నారుగదా!" అన్నాడు.

అక్బరు వీరబల్ తెలివికి చాల సంతోషించి అప్పటినుండి అతనిని గౌరవించటం మొదలుపెట్టాడు.



## పొడుపు పద్యములు

ఎండిన పండిన దొక్కటి
ఖండించిన పచ్చిదొకటి కాల్చిన దొకటి
తిండికి రుచియైయుండును
ఖండితముగ దీనిదెల్పు కవియునుగలడే?

(సంపాదన: ముద్దా కామేశ్వర సోమయాజులు)

పొడుగు తోకగల్గి పొగల దటు నిటు,
పరికింపనది గాలిపటము గాదు;
యెముకలు మాంసము యేమాత్రముండవు
చర్మముండుగాని జలగగాదు;
పాడిపంటల రుచి పసిచూడ దెన్నడు,
జలము గోరుచుండు పశువుగాదు;
వేసవికాలాన యెగిరెగిరి పడుచుండు,
ముసురుకాలమునందు మూలనుండు;
దీనిభావమేమి చందమామ?

(సంపాదన: మదన రామిరెడ్డి, వేజెండ్ల)

[జవాబులు 53 వ పేజీలోవున్నై]

## పజిలుకు జవాబు

| 1 తా | మ | 2 ర | ■ | 3 మా | స | 4 ము |
|---|---|---|---|---|---|---|
| ప | ■ | 5 వి | 6 ది | య | ■ | ది |
| 7 సి | 8 రా | ■ | వ్యే | ■ | 9 భూ | మి |
| ■ | 10 బ | డి | ■ | 11 త్ర | జ | ■ |
| 12 త | డి | ■ | 13 బా | ■ | 14 ము | 15 ని |
| ళు | ■ | 16 పా | వ | 17 లా | ■ | జ |
| 18 కు | దూ | పి | ■ | 19 వా | ర | ము |

# కూరగాయల అపూర్వ నృత్యవాద్య సమ్మేళనము



## పాపలూ!

ఇందులో ఆడేదీ, మద్దెలవాయించేదీ, వీణమీటేదీ అన్నీ కూరగాయలే. వీటిలో దేనిపేరు ఏదో కనుక్కుంటారూ? ఎన్నిపేర్లు కనుక్కుంటే అన్ని మార్కులు. లెఖ్ఖపెట్టి చూసుకోండి ఎవరి కెన్ని మార్కులు వచ్చినాయో!



అబ్బాయిలూ! పై బొమ్మలో మధ్యవి రెండు గీతలు అడ్డంగా గీసివున్నై.
ఆ రెండు గీతలు సరిగా ఉన్నయ్యో వంకరగా వున్నయ్యో కనుక్కోండి.



పై బొమ్మలో పాము, పుట్టలోంచి బైటికొచ్చి తిరుగుతూ, చాలదూరం వచ్చేసింది.
తిరిగి పుట్టకి ఎలా వెళ్ళాలో దానికి తెలియలేదు. మీకు తెలిస్తే సరైనదారి చూపించండి.







## ఆధారములు

### అడ్డము :

1 పద్మము

3 నెల

5 ఒక తిథి

7 షాంపెన్‌కలంలో పోస్తాము

9 నేల

10 పాఠశాల

11 జనులు

12 "పొడి"కి వ్యతిరేకం

14 ఋషి

16 నాలుగణాలు

18 అందములేనివాడు

19 ఏడురోజులు

### నిలువు :

1 తపస్సుచేసేవాడు

2 సూర్యుడు

3 ఇంద్రజాలము

4 ముసలితనము

6 దీపము

8 ఆదాయము

9 వృక్షము

12. కాంతి

13 అక్క మగడు

15 వాస్తవము

16 పాపాలు చేసేవాడు

17 ఇది అగ్నిపర్వతంలోంచి ప్రవహిస్తుంది.

---

49 పేజీలోని పొడుపు పద్యములకు జవాబు: తాంబూలం; మోటబొక్కెన

12 పేజీలోని కుందేళ్ళ బొమ్మలకు జవాబు: 1, 6 నెంబర్ల కుందేళ్లు రెండూ ఒకే మోస్తరువి.

## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

మీరు కథలుగాని, పాటలుగాని యింకా ఏవైనా రచనలుగాని మాకు పంపేటప్పుడు మూడు కానుల పోస్టుబిళ్లకూడా పంపాలి. మీరు పంపినవి వేసుకుంటున్నామో లేదో మీరు తెలుసుకోవాలన్నా, వేసుకోకపోతే వాటిని మీకు త్రిప్పి పంపాలన్నా ఈ మూడు కాన్లబిళ్ల పంపటం అవసరం. మీ రచనగురించి ఏమైనా తెలుసుకోవాలంటే రచనతోపాటే మూడుకాన్ల బిళ్లకూడా పంపాలి. రచన పంపినతర్వాత వ్రాసిన ఉత్తరాలకి జవాబు యివ్వటానికి వీలుండదు.

ఈ విషయాలు క్రొత్తవికావు. ప్రతినెలా మీకు చెబుతున్నవే. అయినా మీలో చాలమంది ఈ సంగతులు గుర్తుంచుకోవటం లేదు. ఇకనైనా గుర్తుపెట్టుకోండి,

రచనలు పంపే అడ్రసు ఇది:

సంచాలకుడు: **చందమామ**

పోస్టుబాక్సు నెంబరు: **1686**, మద్రాసు.


Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1.
Editors CHAKRAPANI and K. RAJA RAO.

